శ్రీ

# వేటూరి ప్రభాకర శాస్త్రి
# (1888-1950)
# జీవితం - వాఙ్మయసేవ

రచన:
డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు



ప్రచురణ:
తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

శ్రీ

# వేటూరి ప్రభాకరశాస్త్రి

(1888-1950)

## జీవితం - వాఙ్మయ సేవ



రచన:
డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు




ప్రచురణ:
తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

SRI VETURI PRABHAKARA SASTRY (1888-1950)
JEEVITHAM-VANGMAYA SEVA by Dr. POGHIRAJU
SESHAGIRI RAO

---

**తెలుగు విశ్వవిద్యాలయం**
హైదరాబాదు-500 004.

ప్రథమ ముద్రణ : ఆగష్టు, 1988

ప్రతులు : 1,000

**వెల : రూ. 6/-**

ప్రతులకు :
**తెలుగు విశ్వవిద్యాలయం,**
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు-500 004.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ, హైదరాబాదు-29.

# ప్రకాశక విజ్ఞప్తి

అపారమైన తెలుగు సాహితీ కోశాగారాన్ని తమ అనర్ఘ రచనా మణి మంజూషలచే సుసంపన్నం చేసిన సారస్వత మూర్తులు వాఙ్మయ చరిత్రలో నిత్య స్మరణీయులు. అటువంటి వారిలో ఆధునిక యుగంలో కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు మిన్నగా ఎన్నదగిన వారు. అటు ప్రాచీన సాహితీ సంప్రదాయాన్ని జీర్ణింప జేసుకొని, ఇటు ఆధునిక విమర్శనా దృక్పథాన్ని గర్భీకరించుకొన్న విద్వత్ పరిశోధకులు వీరు. తెలుగు సాహిత్యంలోని బహు ప్రక్రియలను స్పృశించి అద్భుతమైన సాహిత్యాన్ని సృష్టించారు. తమ ప్రతిభా వ్యుత్పత్తులకు నికషోపలంగా నిలిచే అనేక గ్రంథాలను వెలయింప జేశారు.

శాసనానుశీలనం, తాళపత్ర గ్రంథ సముద్ధరణం, ప్రాచీన కావ్య పరిష్కరణం, విమర్శనం, చారిత్రకోపపత్తుల సమీకరణం, ప్రాచీన శిల్ప ఖండాల సేకరణం, యోగవిద్యానుకరణం - ఇట్లా సహస్ర దళపద్మంగా వారి ప్రజ్ఞాపాటవం వికసించింది. దారి తెలియని ప్రాచీన సాహితీ భాండాగారానికి వీరు కరదీపికగా నిలిచారు.

తెలుగు సాహిత్యాన్ని గురించి తెలుసుకోవాలంటే కీ శే. వేటూరి ప్రభాకర శాస్త్రి గారి రచనలను గురించి తెలుసుకోవాలి వేటూరి వారి రచనలను తెలుసుకొనే ముందు ఒకింత వారి జీవితంలోకి తొంగి చూడాలి కృషితో ఋషిత్వాన్ని పొంది తమ యావజ్జీవితాన్ని సాహిత్యంలోనే పండింప జేసుకొని అంకిత భావంతో చేసిన వారి వాఙ్మయ సేవను దిఙ్మాత్రంగానైనా పరికించాలి. అందుకే, "శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి, జీవితం - వాఙ్మయ సేవ" అనే ఈ గ్రంథాన్ని డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు గారిచే రచింపజేసి, కీ శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారి శత జయంత్యుత్సవ సంవత్సర సందర్భంగా ప్రకటింప జేయడమైనది. కొండను అద్దంలో చూపినట్లుగా వేటూరి వారి సాహితీ విరాడ్రూపాన్ని నిక్షిప్తం చేసుకొన్న ఈ సంక్షిప్త గ్రంథం సాహితీ పిపాసువులను సంతృప్తి పరచగలదని మా నమ్మిక.

హైదరాబాదు,
తేదీ: 25-8-1988.

ప్రకాశకులు :
తెలుగు విశ్వవిద్యాలయం

# అనుక్రమణిక

# 1. ఉషోరేఖ

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తొలుత మనిషి; పిమ్మట మనీషి! వారి జీవిత వాహిని రెండు పాయలుగా ప్రవహించింది. అందు ఒకటి సారస్వత పరమైతే, రెండవది యోగపరం. ఈ రెండు పాయలూ కూడా ఒడ్డు లొరసుకొంటూ ప్రవహించినవే. అన్నింటిలోనూ సత్యగవేషణే శ్రీ శాస్త్రిగారి ధ్యేయం.

కవితలో - పరిశోధనలో - సాహిత్య విమర్శలో - గ్రంథ పరిష్కరణలో సంకలన గ్రంథ ప్రచురణలో - శాస్త్ర వాఙ్మయ సంశోధనలో - దేశి, మార్గ సాహిత్య వివేచనా పటిమలో - శాసన వాఙ్మయ పరిష్కారంలో - చరిత్ర పరిశోధనలో - లిపి సంస్కరణలో - జానపద సాహిత్య సమారాధనలో - ఆంధ్ర సంస్కృతి వికాసానికి కైంకర్య మొనరించడంలో - గాలికి చెదరి, జనుల నోళ్ళలో నాని, తాటియాకుల్లో చివికి, స్మృతిపథమే వాసస్థానంగా బ్రతుకుతున్న చాటు పద్యాల నేర్చి కూర్చి, సంధానించి ప్రకటించుటలో - ప్రభాకరశాస్త్రిగారిని ఏ వైపు నుండి చూసినా ఏడు నిలువుల ఎత్తున సాక్షాత్కరిస్తారు. కలం పట్టినపుడెల్లా కలకాలం నిలిచే క్రొత్త సంగతు లెన్నో త్రవ్వి పోసిన విశిష్ట ప్రజ్ఞా ధురంధరులు. జీవితంలోనూ, సాహిత్యంలోనూ ఉత్తమ విలువలను దర్శించి, రెండింటిలోనూ పరమార్థం తఱచి చూచిన మహావ్యక్తి. సాహిత్యానికి ఒక ప్రయోజనం ఉండాలని వారి నిండు నమ్మకం.[1] సజాతీయ విజాతీయ భాషా సాహిత్యాల అంచులు చూచి, లోతులు తీసి, సాదృశ్య వైదృశ్యాలను సమ్యగ్దృష్టితో మథించి, మీదుకట్టిన మేలి మీగడలతో తెలుగు తేటలను గూర్చి, తేర్చి తెలుగు జాతి కందిచ్చుట ఆయన ఉపజ్ఞ. అట్టి సమన్వయమే రసప్రలుబ్ధులకు పరిశోధన పరాయణులకు రసాయన మని ఆయన ఆజ్ఞ.

కవిగా, పరిశోధకుడుగా వారిది పైకి కనిపించే రూపం. తపస్విగా - యోగిగా - ఆధ్యాత్మిక చింతనా పరుడుగా వారిది ఆంతర రూపం. సాహిత్య పాంథులకు ఏడుగడగా, మనుగడగా గడపిన మనస్వి, కళా తపస్వి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. శతపత్ర సుందరమైన వారి జీవిత చరిత్ర ఆంధ్ర సాహిత్య సంస్కృతులను అభిమానించే వారందరికీ అత్యంతం ఉపాదేయమైన దనటంలో సందేహం లేదు.

---

1. పరిశోధన - 1 వ సంపుటి, 3 వ సంచిక, పుట 1.

# 2. బాల్యం

ఆంధ్రదేశానికి నడిబొడ్డున ప్రవహించే పవిత్ర కృష్ణానదీ తీరంలో దివి సీమలోని పెదకళ్ళేపల్లి వేటూరివారి జన్మస్థానం. స్మార్త - వైదిక - జ్యోతిష - శిల్ప - సంస్కృత - ఆయుర్వేదాల్లో నిష్ణాతులైన వేటూరి సుందరశాస్త్రిగారు వీరి తండ్రి. ఉత్తమ సాధ్వీమణి శేషమ్మగారు తల్లి. ముఖ్యంగా సుందరశాస్త్రిగారా సీమలో పేరు మోసిన ఆయుర్వేద వైద్యులు. శ్రీ ప్రభాకర శాస్త్రిగారు[1] సర్వజిత్ మాఘ బహుళైకాదశీ మంగళవారం ఉదయాది 19 ఘడియలకు జ్యేష్ఠా నక్షత్ర చతుర్థ చరణంలో, అంటే క్రీ. శ. 1888 ఫిబ్రవరి 7 వ తేదీన జన్మించారు. నేటికి సరిగా నూరేళ్ళ క్రిందట అన్నమాట!

వేటూరి వారిది శ్రీవత్స గోత్రం. వెలనాటి వైదిక బ్రాహ్మణులు. వేటూరి సుందరశాస్త్రిగారికి నలుగురు కుమాళ్ళు : 1. వెంకటశివశాస్త్రి, 2. ప్రభాకరశాస్త్రి, 3. చంద్రశేఖరశాస్త్రి, 4. శంకరశాస్త్రి. ఇందులో రెండవ వారే మనకు ప్రసక్తులైన ప్రభాకరశాస్త్రిగారు. ఈ నాటికీ చంద్రశేఖరశాస్త్రి (91), శంకరశాస్త్రి (88) గారలు క్షేమంగా ఉన్నారు.

ఈ పెదకళ్ళేపల్లి చల్లపల్లి సంస్థానంలోని గ్రామం. తాము పుట్టిన ఊరు గురించి శాస్త్రిగారిట్లా వ్రాసుకొన్నారు.[2]

పూర్వకాలమునను పేర్వెలసినది మా
వీడు వేదశాస్త్ర విద్యలకును!
దాని మారు పేరు దక్షిణ కాశిక
కృష్ణ యచట యుత్తరించి సాగె

— 'చిన్ననాటి చేష్టలు' కావ్యంలో

నది ఉత్తర వాహినిగా ప్రవహించటం విశేష మని పెద్దల మాట !

---

1. చూడు. ప్రజ్ఞా ప్రభాకరము.
2. చిన్ననాటి చేష్టలు - 1 వ పుట - 4 వ పద్యం.

తండ్రి సుందరశాస్త్రి గారికి పారంపర్యంగా పురోహితత జీవికయైనా, ఆయుర్వేదం ప్రధానంగా జీవికను నడపిన పుణ్య శ్లోకులు. ఎప్పటికైనా 'మా ప్రభాకరం వంశోద్ధారకు డవుతా'డని ఆయన అంటూండే వారట![1] నిజంగా అంతే జరిగింది; ఆయనది బ్రహ్మ వాక్కు.

బాల ప్రభాకరులు పెదకళ్ళేపల్లిలో కొట్టరువు సుందరరామయ్య గారనే సచ్చరిత్రుల దగ్గర వీథి బళ్ళో ప్రాథమిక విద్య నేర్చుకొన్నారు. అవే ఆనాటి ప్రాథమిక పాఠశాలలు. ఏ విద్య నేర్వటానికైనా శ్రీకారం అక్కడ చుట్టవలసిందే. బాల్యం నుండీ శాస్త్రి గారికి తెలుగంటే వెర్రి తీపి. సుందరశాస్త్రిగారి యిల్లు సంస్కృతాంధ్ర గ్రంథాలకు పుట్టిల్లు. ఆ చుట్టు ప్రక్కల గ్రామాల్లో ఉండే పండితులు ఏ సందేహం తీర్చుకోవాలన్నా వీరింటికి తరచుగా వస్తూండే వారు. ఆ కారణంగానే బాల ప్రభాకరుల చెవిని ఆ పండిత గోష్ఠులు పడుతూండేవి. అవి ఒక సంస్కారాన్ని వారిలో ప్రోది చేయటానికి దోహదపడ్డాయి. ఎడనెడ 'తెలుగు మెఱుగులను' ప్రస్తావవశంగా తండ్రిగారు చెప్పటమూ ఉంది.

వీథిబడి చదువు ముగిసిన తర్వాత పెదకళ్ళేపల్లిలోనే ఉంటూన్న మద్దూరి రామావధానులు గారను బ్రహ్మణ్యుల కడ సంస్కృతం నేర్చుకొన్నారు. తండ్రి సుందరశాస్త్రిగారూ, వీరూ సహాధ్యాయులు.

రామావధానులుగారి జీవన సరణి విశిష్టమైంది. ఆయన బ్రాహ్మీ ముహూర్తంలోనే లేచి, సరిగా వేళకు సంధ్యావందనం, అగ్నిహోత్రకార్యం ముగించుకొని, ఒక్క గంటసేవు ఉంఛవృత్తి నెరపే వారట! ఇంక మధ్యాహ్న కాలమందే వారు శిష్యులకు పాఠ ప్రవచనాలు చేసేవారు. ప్రభాకరశాస్త్రి గారు రామావధానులు గారి కడ శబ్ద పరిచయమూ, కాళిదాస త్రయమూ పూర్తి చేసుకొన్నారు. ఇంటిలో తెలుగు చదువులు. "తెలుగు రచన లనగా చిన్ననాటి నుండియు నాకు బులుపాటము. తెలుఁగు పద్యములు వినుటకై చెవి కోసుకొను వాడను. గుజ్జనగూళ్ళతో పాటు తెలుగు రచనల తీయఁదనము కూడా మా నాయనగా రాస్వాదింప జేసినారు"[2] ఇవి శాస్త్రిగారి మాటలు.

---

1. వేటూరి శంకరశాస్త్రిగారు నాతో చెప్పిన సంగతి.
2. తెలుగు మెఱుగులు - పుటలు. 29, 30.

అయితే ప్రభాకర శాస్త్రిగారిది బాల్యం నుండీ గతానుగతికంగా పోయే ప్రవృత్తి కాదు. మూఢవిశ్వాసాలపట్ల ఆదర మంటారా? తొలినుండీ లేదు. జాతరలన్నా, జంతు బలులన్నా విలవిలలాడిపోయేవారు. వారిది స్వతంత్ర ప్రవృత్తి. ఎందువల్లో వంశంలో అనూచానంగా వస్తున్న పురోహిత వృత్తి వారికి రుచింపలేదు. బాల్యంనుండీ సాహిత్యంపైపే మొగ్గు. భాషాలోలత అందుకు కారణం కావచ్చు. గ్రాసవాసోదైన్యము లేని జీవనం, స్వతంత్ర ప్రవృత్తి అందులకు తోడైంది. అది కారణంగా శాస్త్రిగారు పెదకళ్ళేపల్లికి సమీపంలోని చల్లపల్లికి చదువుకై బయలుదేరారు. ఆ ఊరు ప్రాచ్యవిద్యలకు కాణాచి.

చల్లపల్లి పెదకళ్ళేపల్లికి నాల్గుమైళ్ళు. చల్లపల్లి ప్రభువులు శ్రీ యార్లగడ్డ వారు; కవి, పండిత పోషకులు. తెలుగునాట పేరుమోసిన విద్వాంసులు వచ్చి చల్లపల్లి రాజావారి నుండి పారితోషికాలు పొందుతూండేవారు. ఆ నాటి ఊళ్ళల్లో విద్వద్గోష్ఠులూ, పండిత చర్చలే ప్రధానంగా వినబడుతూండేవి. పెదకళ్ళేపల్లిలో ఒక శతాబ్ది క్రితం ప్రసిద్ధులైన పండితుల్లో మద్దూరి రామావధానులు, తంగిరాల వెంకటావధానులు, తెంజర్ల సాంబశివశాస్త్రి, బుద్ధు భూషయ్యశాస్త్రి, యడవల్లి అప్పావధానులు, ప్రభల ఆదినారాయణావధానులు మొదలైన వారు పెద్దలు. సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిుల వారిది కూడ ఆ ఊరే! అట్టి పండితు లున్న గ్రామంలో శాస్త్రిగారి బాల్యం గడిచింది. ఆ గ్రామం లోని నాగేశ్వరస్వామి, గోపాలస్వామి ఆలయం అరుగుల మీద నిరంతరం పండిత గోష్ఠులే. 'కాంత మిద మాశ్రమ పదమ్' అన్నట్లు ఉండేవి ఆ నాటి పల్లెలు.

ఇంగ్లీషు చదువులు వ్యయ ప్రయాసలతో కూడి ఉండటం, అవి మరీ దూర ప్రాంతాల్లోనే ఉండటం, ఒంటరిగా విద్యార్థు లుండవలసి రావటం, తల్లి దండ్రుల వీడవలసి రావటం కారణంగా శాస్త్రిగారికి ఆంగ్ల విద్య అంటే సరిపడలేదు. అది అలా ఉంచితే బాల్యంనుండీ తెలుగుపై మోజు. అందుచేత ఆంధ్ర, గీర్వాణాలు నేర్చుటలోనే శాస్త్రిగారికి మనసు పడింది.

పెదకళ్ళేపల్లి చదువు పూర్తయిన తర్వాత, శాస్త్రిగారు సమీపంలోనే ఉన్న చల్లపల్లికి వెళ్ళి అద్దేపల్లి సోమనాథ శాస్త్రిులవారి సన్నిధిలో సంస్కృతం నేర్వ నారంభించారు. అక్కడే ప్రభాకర శాస్త్రిగారికి సహాధ్యాయులయ్యారు-

అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. ఈ సోమనాథ శాస్త్రులవారు తర్క-శాస్త్ర సాగరాన్నంతా కడముట్ట చూసినవారు. ఆయన తన ప్రజ్ఞా వైభవాలతో అనంత శయనం మహారాజా వారినుండి సువర్ణకంకణం బహుమతిగా పొందారు. ప్రభాకర శాస్త్రిగారు సోమనాథ దేశికులవద్ద లఘు కౌముదీ, తర్క-శాస్త్రంలో ఒకటి రెండు ప్రకరణాలూ భాష్యంలో పతంజలి యోగ సూత్రాలూ, కావ్య నాటకాలంకార శాస్త్రాలూ నేర్చారు. పిసుపాటి వేంకటరామ శాస్త్రిగారప్పుడే వీరికి సహాధ్యాయి. శాస్త్రిగారికి సోమనాథ దేశికుల తపస్వితపై మహాభక్తి, ఆ చదువుకొనే రోజుల్లోనే పతంజలి యోగ సూత్రాలు శాస్త్రిగారిలో చొచ్చుకొనిపోయి వింత యోచనలు రేపినాయి. ముందు ముందు శాస్త్రిగారి యోగనిష్ఠాపరతకు ఇవి ఎంతగానో దోహదం చేశాయి. శాస్త్రిగారు పదహారేళ్ళు వచ్చేవరకూ సోమనాథ శాస్త్రుల వారి శిష్యరికంలోనే ఉండి చదువుకొన్నారు.

## బందరులో:

ఇది ఇలా ఉండగా 1904 నాటికే బందరు ప్రాంతంలో చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారి పేరు మార్మ్రోగుతూండేది. వారి కవితా జీవన సరళిని గూర్చి ఎన్నో కథలూ, గాథలూ ప్రజలు చెప్పుకోసాగారు. ఆ రోజుల్లో వెంకటశాస్త్రిగారులేని సభంటూ బందరులో లేదు. అప్పటికే చెళ్ళపిళ్ళవారు ఆంధ్ర దేశంలోని సంస్థానా లన్నీ సందర్శించి ఎన్నో సన్మానాలు పొందారు. ఆ యీ సంగతులు ప్రభాకరశాస్త్రిగారికి ప్రోద్బలకం కాగా, బందరులో చెళ్ళపిళ్ళవారి దగ్గర శిష్యులుగాచేరారు. ఇది 1904 లో. వీరి కంటె కొన్ని నెలలు ముందుగా అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగా రక్కడ ప్రవేశించారు. ఆ యేడే పిఠాపురంనుంచి వచ్చిన ఓలేటి వేంకటరామశాస్త్రిగారూ ఈ వెంకటశాస్త్రిగారికి శిష్యులయ్యారు. ఈ ముగ్గురికీ సాహిత్య విద్యా గురువులు చెళ్ళపిళ్ళవారే. 1904-6 నడుమ రెండేళ్ళపాటు చెళ్ళపిళ్ళ దేశికోత్తములవద్ద గురుకులక్లిష్టులై సాహిత్యం, కవితా కళా నేర్చారు.[1] తెలుగున నా కేమేని యెఱుక యేర్పడెనన్నచో నది శ్రీ వెంకట శాస్త్రిగారి గురుతానుగ్రహప్రాప్తమే అని శాస్త్రిగారే వ్రాసుకొన్నారు అయితే వెంకటశాస్త్రిగారి దగ్గర పుస్తకం పట్టి చదవటం అలా ఉంచితే, వారి ముఖతః

1. ప్రజ్ఞా ప్రభాకరము - పుట 32.

వినోదగోష్ఠిలో నేర్చింది చాలా. ఆ ప్రసంగ సందర్భాల్లోనే పూర్వ కవులు తమ కావ్యాల్లో చూపిన చమత్కారాలూ, ఎన్నో కావ్య నాటకాలంకారాది విషయాలూ దొరలుతుండేవట! వారి ప్రసంగాలు వినటమే ఒక విద్య అంటారు పెద్దలు. బందరులో ఉన్న రోజుల్లోనే 'దేశభక్త' కొండా వెంకటప్పయ్య, సుప్రసిద్ధ వకీలు వల్లూరి సూర్యనారాయణరావుగారల అభిమానానికి ఆయన పాత్రు లయ్యారు. శాస్త్రిగారా యిద్దరినీ 'ప్రజ్ఞా ప్రభాకరము'న ఎంతో కృతజ్ఞతతో స్మరించారు.

అవధాన విద్యకు తిరుపతి వెంకట కవులు పెట్టింది పేరు వెంకటశాస్త్రిగారి ఒజ్జరికంలో పెరిగిన నాళ్ళలోనే అష్టావధాన, శతావధానాలు నేర్చి, కొంత మేరకు నిష్ణాతులైనట్లు శాస్త్రిగారి సతీర్థ్యులు వేమూరి సీతారామశాస్త్రిగా రుట్టంకించారు.[1] ఆయనే వెంకటశాస్త్రిగారిని తమ ఊరికి తీసికొని వచ్చి శాస్త్రిగా రష్టావధాన మొనర్చినట్లు వినికి అన్నారు. ఈ అన్నింటిని పరిశీలిస్తే, శాస్త్రిగారు విద్యార్థిగా ఉండగానే అష్టావధాన శతావధానాలు చేసినట్లు నమ్మవచ్చును. ఇందుకు మరో సాక్ష్యం 1911లో పోలవరం జమీందారులు శ్రీరాజా కొచ్చెర్లకోట వేంకట కృష్ణారావు బహద్దూర్ వారు నడిపిన 'సరస్వతి' పత్రిక (జార్జి పట్టాభిషేక సంచిక)లో శాస్త్రిగారి పద్యము లున్నాయి. ఆ పద్యాల దిగువ "శతావధాని వేటూరి ప్రభాకరశాస్త్రి" అని ఉన్నది. అవధానవిద్య రాజ్యమేలుతున్న దినాల్లో ప్రభాకరు లవధానాలు చేశారనటం నమ్మదగ్గదే అవుతుంది. ఆ పిమ్మట అవధానాలు చేయటం వృత్తిగా స్వీకరించక క్రమంగా వదలివేసి సాహిత్య పరిశోధన, కవితా రచనల కంకితమైనట్లు కన్పడుతుంది. అదే మేలైంది. పరిశోధనలో ప్రాగ్రేసరులై శాస్త్రిగా రనంతర కాలంలో విశేషఖ్యాతి ఆర్జించారు కూడా. అయితే దేశంలో ముమ్మరంగా ప్రచార ప్రశస్తు లందుకొన్న అష్టావధాన, శతావధానాలు చిన్న తనంలో శాస్త్రిగారిని ఆకర్షించి, అందులోనూ వన్నెవాసులు గడింపజేసిన వనే మాట మాత్రం వాస్తవం.

---

1. పరిశోధన - 1వ సం. 6వ సంచిక.

# 3. మద్రాసు జీవనం (1906-1939)

రెండేళ్ళపాటు బందరులో శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి మహోద యులవద్ద గురుకుల క్లిష్టులై సాహిత్యవిద్య నేర్చి, ఆ పిమ్మట 1906 లో మదరాసు చేరారు. ఇది ప్రభాకరశాస్త్రిగారి జీవితంలో చెప్పుకోదగ్గ మలుపు. మదరాసు పోవడానికి సముచిత నిర్ణయం చేయడంలో ప్రధాన ప్రేరకులు శాస్త్రి గారి అభ్యుదయాన్ని నిరంతరం కాంక్షించే వల్లూరి సూర్యనారాయణగా రనే ప్రసిద్ధ వకీలు ముఖ్యులుగా కనబడతారు. ఎన్నో అభ్యుదయ భావాలు గల ఉదార చరితులు శ్రీ సూర్యనారాయణరావు గారు. అట్లా కాకుండా బందరు ప్రాంతంలోనే ఏ పాఠశాలలోనో పండితులుగా కుదురుకొని ఉంటే ఏమయ్యేదో! దేశం ఎంతో నష్టపోయేదని తోస్తుంది. అదీ గాక శాస్త్రిగారి బావగారు కాజ శేషయ్య గారు మదరాసులో న్యాయవాది వేపా రామేశం పంతులుగారి వద్ద పని చేస్తూండేవారు. అందువల్ల శాస్త్రిగారికి మదరాసు రాక కొత్త అనిపించలేదు. ఎంలో ఉత్సాహంతో పదునెనిమిదేండ్ల వయస్సులోనే ప్రభాకరశాస్త్రిగారు మదరాసుకు చేరుకొన్నారు.

ఆ నాటి మదరాసు సాహిత్యానికీ, సంస్కృతికీ కేంద్రం. కందుకూరి వీరేశలింగం పంతులు, వేదము వేంకటరాయశాస్త్రి, కొక్కొండ వెంకటరత్నం పంతులు వంటి ఉద్దండ పండితులకు చెన్నపట్టణం నిలయం. శాస్త్రిగారు 1910 వరకు తిరువళిక్కేణిలోని వెస్లీమిషను హైస్కూలులో పండితులుగా పని చేశారు. 22-8-1910 వ తేదీన మదరాసు ప్రభుత్వ ఓరియంటల్ మ్యానుస్క్రిప్టు లైబ్రరీలో తొలుత 'కాపీయిస్టు' (లేఖకుడు) గా రూ. 20-1-26 ల వేతనంపై చేరారు. కాపీయిస్టుగా చేరడానికి ముందే కృష్ణాజిల్లా ఘంటసాల నివాసులైన పిసిపాటి జగన్నాథంగారి కుమార్తె 'మహాలక్ష్మి' గారిని శాస్త్రిగారు వివాహమాడారు. ఆమె అమృత హృదయ. ఎప్పు డేవేళ అతిథి ఇంటికి వచ్చినా అలయక సొలయక ఆతిథ్యమిచ్చే అన్నపూర్ణ. ఆమె శాస్త్రిగారి అర్ధాంగిగా చేసిన సేవ ఎంతో గొప్పది.

శాస్త్రిగారింటికి వచ్చే బంధువులకూ, మిత్రులకూ, ఆప్తులకూ ఒక ఇల్లాలుగా ఆమె చేసిన సేవ తల్చుకొని ఇప్పటికీ వారు పులకరిస్తూ, ఆనందంతో చెప్పుకొనే మాటలు నేను విన్నాను. లోలోన ఆ తల్లికి నమస్కరించుకొన్నాను. ఆ ఇల్లాలు శిష్యులైన మమ్ముల్ని పుత్ర నిర్విశేషంగా ప్రేమించేది, ఆదరించేది, ఆదుకొనేది; అదో పెద్ద గాథ !

శాస్త్రిగారు ప్రాచ్య లిఖితపుస్తక శాలలో లేఖకుడుగా చేరిన కొన్ని మాసాలకే ఆ లైబ్రరీ క్యూరేటరు శాస్త్రిగారిని గూర్చి విని తెలుగు పుస్తకాలకు క్యాటలాగు వ్రాసే గుమాస్తా సెలవు పెట్టగా అందులో తాత్కాలికంగా నియమించారు. పిమ్మట అందే 'పండిత పదవి' ఖాళీ పడగా, 2-6-1916 నుండి శాస్త్రిగారిని అందులో ఖాయపరచారు. 1939 వ సంవత్సరాంతం వరకు శాస్త్రిగారు ఆ పదవిలోనే ఉన్నారు. అక్కడుండగానే కొన్ని ఏళ్ళపాటు చెన్నపురి నుండి బరంపురం వరకూ తెలుగు నాడంతటా ప్రాచీన గ్రంథ సేకరణార్థం పర్యటించారు.

1931-39 నడుమ ప్రభుత్వ రాజధానీ కళాశాల (ప్రెసిడెన్సీ కాలేజీ) లో శ్రీ అక్కిరాజు ఉమాకాన్త విద్యా శేఖరులు పండితులుగా ఉండేవారు. ఆ పదవిలో అంతకు పూర్వం పరవస్తు చిన్నయసూరీ, వావిలికొలను సుబ్బారావూ, కందుకూరి వీరేశలింగం పంతులూ, కొక్కొండ వేంకటరత్నం పంతులూ మున్నగువా రుండేవారు. అప్పటి ఆంధ్ర భాషా పీఠమంతటి ప్రశస్తి పొందింది. శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులు తరచు అనారోగ్య గ్రస్తులవటంతో, ఇంచుమించు ప్రతి యేటా మూడు, నాలుగు మాసాలు ప్రభాకరశాస్త్రిగారు రాజధానీ కళాశాలలో పండితులుగా పని చేయటం తటస్థించింది. ఆ పదవి పూర్తిగా ఖాళీ పడినప్పుడు శాస్త్రి గారికి ప్రభుత్వ మా పదవి ఈయలేదు. అదొక 'తమాషా' అన్నారు - ఈ సంగతిని నేను ప్రస్తావిస్తే వారి జ్యేష్ఠ పుత్రులు డా॥ సుందరమూర్తిగారు.

1934 కు ముందే శాస్త్రి గారికి నరసరావుపేటలో ఆంధ్ర సారస్వత మహాసభ 'విమర్శకాగ్రేసర' బిరుద మిచ్చి సత్కరించింది. 1934 లో లెక్చరర్ పదవికి పెట్టిన దరఖాస్తులో ఈ బిరుదం ప్రస్తావింపబడింది.

మొత్తం మీద శాస్త్రిగారు 1910 నుండి ముప్పది యేళ్ళ పాటు మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో పండితులుగా పనిచేశారు. సర్వసారస్వత వ్యాసంగాల్లోనూ విశేష కృషి గావించిన కేంద్ర స్థానం మద్రాసే! ఆ కాలంలో అక్కడ వారు పాల్గొనని సాహిత్యసభంటూ లేదనటం అతిశయోక్తి కాదు.

1939-1940 ప్రాంతంలోనే ఆంధ్ర విశ్వకళా పరిషత్తులోని పండిత పదవికి దరఖాస్తు చేశారు. వీరితో పాటే దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారున్నూ దరఖాస్తు చేశారు. ఏ కారణాలవల్ల శాస్త్రిగా రాపదవికి ఎన్నిక చేయబడలేదో తెలియదు కాని, వీరికంటె వయసున పిన్న అన్న కారణాన దువ్వూరి వారిని ఎన్నిక చేసినట్లు లోకం చెప్పుకొంటూండేది.

# 4. తెలుగు నాట సంచారం

ప్రాచీన గ్రంథ సేకరణ కోసం మద్రాసు ప్రభుత్వం శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారిని, ప్రభాకరశాస్త్రిగారిని ఎన్నిక చేసింది. ఆ ఉత్తర్వుల ననుసరించి 1916 నుండీ కొన్ని యేళ్ళపాటు శాస్త్రిగారు తెలుగునాట ఊరూరా ప్రాచీన తాళపత్ర ప్రతులకై తిరిగారు. ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్క పండితులు వీరికి సహాయకులుగా ఉంటూ వచ్చారు. అట్లా ఉన్నవాళ్ళల్లో ఈ నాటి నెల్లూరు, ప్రకాశం జిల్లా ప్రాంతాలలో వీరితో సంచారం చేసిన విద్వాంసులు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు. కృష్ణాజిల్లా సంచారంలో శ్రీమాన్ దీవి నరసింహాచార్యుల వారు- ఇట్లెందరో !

1916 లోనే మదరాసు ప్రభుత్వం ఆదేశానుసారం మానవల్లివారూ, ప్రభాకరశాస్త్రిగారూ తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలోని పుస్తకాల విలువలు, వివరాలు తేల్చటానికై కొన్ని మాసాలు పనిచేశారు. అంతకు ముందే 1914 లో శాస్త్రిగారు పరిశోధన పిపాసతో తంజావూరు పోయి, అక్కడి విశేషాలు గుర్తించుకొని వచ్చారు. ఆ సంవత్సరంలో ప్రకటించిందే 'తంజావూరి ఆంధ్ర రాజుల చరిత్ర'.

ప్రభాకరశాస్త్రిగారికి ప్రాచీన గ్రంథ సముద్ధరణంలోనూ, వాని ప్రకటనం లోనూ తొలినుండీ మిక్కిలి కుతూహలం. ఈ విషయంలో శాస్త్రిగారికి ప్రేరణ కందుకూరి వీరేశలింగం పంతులుగారు.[1] ప్రభాకరశాస్త్రిగారు ప్రాచీన గ్రంథాలు సంపాదించటంకోసం ప్రభుత్వం పక్షాన తిరగటంలో అప్పటికి దొరకని గ్రంథాలెన్నింటినో సంపాదింపగలిగారు.[2] 1917 లో 'గ్రంథ రత్నములు' అనే వ్యాసంలో ఇట్లా అన్నారు : 'ఈ అనుపలబ్ధ ప్రాచీన గ్రంథములను గూర్చి

1. ఆంధ్ర రచయితలు (1944) వే. ప్ర. పీఠిక చూచునది.
2. 20-1-1917 కృష్ణాపత్రిక.

పుస్తకముగా ప్రచురింపదగినంత విషయము కలదు. ఆలించువారే అంతగా కానరారు. త్వరపడి తాటియాకు కట్టలను, ఇప్పటికి నిలిచి యున్నంతవరకైన, బరిశీలింప బూనుదురేని కొన్నియైన గ్రంథరత్నములు వెలువడకపోవు. గ్రంథాన్వేషణలో శాస్త్రిగారి తపనకు హద్దులు లేవు. వారే తమ అనుభవాల నిట్లా చెప్పుకున్నారు.[1] "1919లో గ్రంథపరిశీలనకు మోదుకూరు(గుంటూరుజిల్లా)న కరిగితిని. సంపన్నులగు భట్రాజుగారి యింట గ్రంథములన్నియుఁ జెడిపోగా బాఱవైచిరట ! ఆ పాఱవైచినవానిలో గానవచ్చిన వానిలోని పీ క్రింది పద్యరత్నములు.... తునిగిపోయిన యీ పద్యముల యాకులను జూచి నేను మిక్కిలి దుఃఖించితిని." ఇదీ శాస్త్రిగారి వేదన !

ప్రాచీన గ్రంథార్థాల పలుకుబడి పల్లెటూళ్ళలో ఎంతగా చెల్లుబడి అవుతున్నదో శాస్త్రిగారికి తెలిసినట్లు ఇతరులకు తెలియదు తెలుగునాట ఎన్నో శ్రమల కోర్చి ఊరూరా తిరిగారు. ఒకతూరి గుంటూరు మండలం సంచరిస్తూ ఎండపడి డస్సి బసకు చేరుకొన్న శాస్త్రిగారు ఒకచాటువు నిట్లాఅల్లినారు.

ఉ॥ దూరమునుండి యెండఁ బడి దూపిలి యింటికి నేగుదెంచు చో
ప్పారసి కూర్మి పేర్మి వినయంబు భయంబు దొలంకు చూడ్కి నిం
డారిన మోముతోడ నెదురయ్యెడి తొయ్యలి డించి, దేశసం
చారము సేఁత రోఁత పరిచారకులా? ధనమా! వృథా! వృథా!

శాస్త్రిగారు ప్రాచీన గ్రంథ ప్రకటనకై తెలుగుజాతిని హెచ్చరించటంతో తృప్తిపడలేదు. కొన్ని అమూల్య గ్రంథాలను ప్రకటించాను. దాని పర్యవసానంగా 1, చాటుపద్య మణిమంజరి (1913), 2. ప్రబంధ రత్నావళి (1918), 3. చాటుపద్య మణిమంజరి ద్వి.భా. (1922), 4. బసవోదాహరణము (1928), 5. నీతి ద్విషష్టికా (సంస్కృతకృతి, 1928), 6. సుగ్రీవ విజయము (1939), 7. శ్రీ వేంకటేశ్వర వచనములు (1945), 8. తాళ్ళపాకవారి సంకీర్తలు, 4,5 సంపుటాలు (1949), 9. చక్రపాణి రంగన 'నయన రగడ', 10. శృంగారామరుకము (1949), 11. పావులూరి గణితము (1950), 12. కామందకము

1. 1927 సెప్టెంబరు - 'సుభాషి' - పుట 108.

(1950), 13. తిమ్మకసుభద్రా కళ్యాణము (1950), 14 శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు. ప్రభాకరశాస్త్రిగారు తామె ప్రాచీనగ్రంథాలు ప్రకటించటమేకాక, ముక్త్యాలరాజావారిచే తెనాలిరామలింగ కవి ఉద్భటారాధ్య చరిత్రనూ (1925), దగ్గుపల్లి దుగ్గన 'నాసికేతూపాఖ్యానము'ను ప్రచురింప జేశారు. ఆంధ్రసాహిత్య పరిషత్తు మల్లికార్జున పండితుల 'శివతత్త్వసారము' ప్రకటించటానికి ప్రేరకులు శ్రీ ప్రభాకర శాస్త్రిగారే అంటే ప్రాచీనగ్రంథ గవేషణకూ, ప్రచరణకూ వారు పడ్డ తపన మన కర్థమవుతుంది. అందుకే నేమో శాస్త్రిగారు 'తాళపత్ర గ్రంథములు'[1] అన్న వ్యాసంలో ఇలా వ్రాసినారు. మా పుట్టుకకు ప్రాచీన గ్రంథ సముద్ధరణము ఒక పరమార్థమా యని తోచుచున్నది' అన్నారు.

నెల్లూరుజిల్లా 'కనిగిరి'ప్రాంతంలో సంచరిస్తూ మిత్రులు చల్లా సూర్యనారాయణ రావుగారికి లేఖ వ్రాస్తూ తమ అనుభవాల నిట్లా వెల్లడించినారు.[2]

ఉ॥ ఎండలు మెండు, నీళ్ళు లభియింపవు, కూరలు లేవు, పూవులుం
బండులు కానరావు, బలవంతమె యైనను వానలేమిచేఁ
బండదు భూమి, లేమిఁబడు పాటులు మిక్కిలి, దారిదోపుడుల్
మెం డిటువంటి దేశమున మేము చరించుచునుంటి మిత్రమా!

తెలుగునాట ఊరూరా వాడవాడా తిరిగి మదరాసు చేరుకొన్నారు. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తకశాల తరపున సంపాదించిన తాళపత్ర గ్రంథాలకు 19 సంపుటములుగా డిస్క్రిప్టివ్ క్యాటలులాగులు తయారుచేసే బాధ్యతను శాస్త్రిగారు నిపుణంగా నిర్వహించారు. అవి భాషా సాహిత్య పరిశోధనకు ఆధార గ్రంథాలై (Source books) కూర్చున్నాయి. వాటిని తడవందే ఏ పరిశోధకుడూ ముందుకు సాగలేడు. భావిపరిశోధకులకు పనికివచ్చే పుస్తకాలు రచించాలనే వారి సదుద్దేశం మౌలికమైంది.

---

1. 1950 సెప్టెంబరు భారతి.
2. 16-5-1922 న వ్రాసిన లేఖ నుండి.

స్థానిక చరిత్రలు (Local Records) అనే పేర మెకంజీ సంపాదించి ఉంచిన వానినెల్లా కన్ను పొడుచుకొని చదవటమే కాదు, కొన్నింటిని గమనార్హము లైనవాటిని పత్రికల్లో ప్రచురించి ఒక జాగృతిని కల్పించిన మహానుభావులు ఆయన.

తీరని భాషా తృష్ణతో శాస్త్రిగారు గ్రంథాన్వేషణ చేశారు. శక్తి మేరకు కొన్నింటినైనా ప్రచురించారు. మరి కొన్నింటిని ఇతరులచే ప్రచురింప జేశారు. ఈ సందర్భంగా ఎన్నో వ్యాసాలు ప్రచురించారు. భాషా పరిశోధకులకు అవసర మైన ఆధార గ్రంథాలు ప్రకటించే సంప్రదాయానికి మార్గదర్శకులైనారు. 'గాలి కబుర్లు' అనే పేరిట తెలుగువాళ్ళ నోళ్ళలో నానుతున్న పలుకుబళ్ళు, నుడికారాలు, సామెతలు, పలుకు గుత్తులు సేకరించి, వింగడించి సంపుటాలుగా పెట్టుకొన్నారు. అవి యింకా వెలుగును చూడవలసే ఉన్నాయి.

## పెద్దలతో పరిచయాలూ–సన్నిహితత్వమూ :

ప్రభాకరశాస్త్రిగారు మదరాసు చేరిన వెంటనే శ్రీ వేపా రామేశం పంతులుగారితో పరిచయమైంది (1906). అది క్రమక్రమంగా గాఢమైంది. రామేశంగారు విద్యా రాశి. న్యాయశాస్త్ర పాండిత్య మటుండగా, వారు గణిత, ఖగోళ, చరిత్రాదుల్లో నిష్ణాతులు. వారితో శాస్త్రిగారు ప్రతిదినమూ గంటలతరబడి విద్యా వినోదాన్ని అనుభవించే వారు. నిరంతర పఠనాసక్తి శాస్త్రిగారికి వారి సన్నికర్షవల్ల అబ్బిందే. ఆ పిమ్మట మిత్రులయిన వారిలో సుప్రసిద్ధాయుర్వేదాచార్యులు పండిత డి. గోపాలా చార్యు లొకరు. వీరి మూలంగా శాస్త్రిగారికి పరిచయమైన వారు శ్రీమాన్ పనప్పాకం అనంతాచార్యులవారు. నాటి మదరాసు వకీళ్ళలో పేరుమోసినవా డాయన. ఆయనకు సాహిత్యాభిరుచి ఎక్కువ. స్వంతంగా 'వైజయంతి' ప్రెస్సు ఉండేది. నాటి రాజకీయాల్లో కూడా అనంతాచార్లవారు ప్రసిద్ధులు. అఖిల భారత కాంగ్రెసు నాగపూరు సమావేశానికి (1891) అధ్యక్షు లయ్యారు. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్ష పీఠాన్ని అలంకరించిన తొలి తెలుగువాడు ఈయనే. ఆచార్యుల వారి భవంతి ఒక భువనవిజయ సభావేదికలా ఉండేదట! అందులో ఎన్నో సాహిత్య వినోదాలు–ఆశు కవితలూ–సమస్యా పూరణలూ, ఒకటేమిటి! శ్రీ మాన

వల్లి రామకృష్ణయ్యగారికి 'కవి' బిరుద మిచ్చింది కూడా ఆయనే! ప్రభాకర శాస్త్రిగారికి 'కవి చూడామణి' బిరుద మిచ్చిందీ వారే అయి ఉంటారు. ఈ బిరుదాన్ని వేదము వేంకటరాయశాస్త్రిగారు తమ ఆముక్తమాల్యదా వ్యాఖ్యానంలో పలుచోట్ల పేర్కొన్నారు. శాస్త్రిగారికి ఎవరే బిరుద మిచ్చినా దానిని ప్రకటించుకొనే అలవాటు లేదు. అది వారి ప్రకృతి. ఆంధ్రభాషా సౌధ నిర్మాణంలో మట్టి ముద్దలు మోసినవాణ్ణని ఆయనే చెప్పుకొన్నారు - భారతికి వ్యాసం వ్రాస్తూ.

మదరాసులో ఆ నాడు సుప్రసిద్ధులైన రెంటాల వెంకట సుబ్బారావుగారు, డాక్టర్ అచంట లక్ష్మీపతి, విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, టంగుటూరి ప్రకాశం పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు గారు ఇట్లా ఎందరితోనో శాస్త్రిగారికి పరిచయమే కాదు, వారెంతగానో శాస్త్రిగారి నభిమానించేవారు.

కొంతి రామమూర్తిగారు ఎం.ఏ ప్యాసయి ఐ.సి యస్ కు వెళ్ళే సందర్భంలో వారిని ఆశీర్వదిస్తూ సభలో శాస్త్రి గారు పద్యాలు చదివారు. అలాగే భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు, కొండ వెంకటప్పయ్య పంతులు మున్నగు ప్రసిద్ధు లెందరో శాస్త్రిగారి నాదరించి, అభిమానించారు.

ఇక కవి, పండితుల విషయానికి వస్తే వేదం వేంకటరాయశాస్త్రిగారితో సన్నిహితత్వ ముండేది. అట్లాగే గురజాడ అప్పారావుగారితోనూ! శ్రీ అప్పారావుగారు మదరాసు వచ్చినపుడల్లా శాస్త్రిగారిని కలియకుండా వెళ్ళేవారు కాదు. తరచుగా రాకపోకలుండేవి. గురజాడవారి 'పూర్ణమ్మ' ప్రచురింపబడిన తొలి రోజుల్లో మనసారా అభినందించి, భాషాభ్యుదయ్యాన్ని కోరిన పండితులు ప్రభాకర శాస్త్రిగారు.

శాస్త్రిగారు మదరాసులో ఉన్నంత కాలం, వారింటికి పెద్ద లెంతో మంది వచ్చేవారు. వారికి ఆతిథ్యం శాస్త్రిగారే ఇచ్చేవారు. అట్లా వచ్చేవారిలో మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి ప్రభృతు లెంద రెందరో! శాస్త్రిగారికి ఇంకా సన్నిహితులైన

వారిలో కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ముఖ్యులు ఆ నాడు పేరొందిన పండితు లెందరితోనో శాస్త్రిగారికి సన్నిహితత్వ ముండేది. తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్యగారు శాస్త్రిగారి సన్నిహిత మిత్రుల్లో ఒకరు ఇక రాయప్రోలు సుబ్బారావు వీరికి బాల్యమిత్రులు. గురజాడ అప్పారావుగారి ద్వారా తొలుత పరిచయమయి, తరువాత సన్నిహితులైనవారు గిడుగు రామమూర్తి పంతులుగారు. గిడుగువారి వ్యావహారిక భాషావాదానికి ఒక భుజ మొగ్గి తోడ్పడ్డ భాషాపండితుల్లో ప్రభాకరశాస్త్రిగారే ప్రథము లనటం కద్దు.

ప్రభాకరశాస్త్రి గారికి ఇరవై, ఇరవై యిదేళ్ళ వయస్సు వచ్చేసరికే ఆంధ్ర దేశంలోని ప్రముఖులతో - ప్రధానంగా చెన్నపురిలోని విద్వాంసులతో - రాజకీయ ధురంధరులతో, భాషాపోషకులతో, శాస్త్ర పండితులతో, న్యాయవాది ప్రముఖులతో గాఢ పరిచయ మేర్పడింది. ఇందరి పెద్దలతో పరిచయం, శాస్త్రి గారి భాషా వ్యాసంగానికి పరిపోషక మైంది. అతి స్వల్ప వేతనంతో కాలక్షేపం చేస్తూ మదరాసు వచ్చిన పండిత మిత్రుల కాతిథ్యమెట్లా ఇచ్చారో తల్చుకొంటే ఆశ్చర్యం వేస్తుంది.

ఆ నాటి జమీందారులల్లో ముక్త్యాల రాజా శ్రీ వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర బహద్దరు వారు, కపిలేశ్వర పురాధినాయకులు శ్రీ రాజా బలుసు బుచ్చి సర్వారాయ బహద్దరు వారు ప్రభాకరశాస్త్రిగారి యెడల మిత్రభావము చూపి, ఆప్తత నెఱపిన సరస హృదయులు.

మదరాసులో ఉన్న రోజుల్లోనే శాస్త్రిగారిని గురువుగా ఆరాధించిన వారిలో ప్రముఖులు మదరాసు హైకోర్టు ప్రధాన న్యాయ మూర్తులుగా వర్తించిన శ్రీ పాకాల వెంకట రాజ మన్నారు. వీరు 1922 లో 'కళ' అనే పత్రిక నడిపారు. ఆ రోజుల్లో మైలవరం, సురభి కంపెనీలు మదరాసులో నాటకాలు వేసేవి. శ్రీరాజ మన్నార్ గారితో శాస్త్రిగారూ ఆ యా నాటక ప్రదర్శనలకు వెళ్ళి ఆ యా నాటక ప్రదర్శనలపై, రచనా ధోరణిపై విమర్శ వ్యాసాలు వ్రాసేవారు. ఉత్తమ నటుల నభినందిస్తూ పద్యాలు వ్రాసేవారు. కపిలవాయి రామనాథ శాస్త్రి నటనా వైదుష్యా న్నభినందిస్తూ ఒక పద్యా న్నిట్లా వ్రాశారు :

చం॥ ప్రకటముగా రసార్ద్రముగఁ బద్యములం బఠియించె, భావ రీ
తికిఁ దగునట్లు మోముకళ తీర్చెను, శ్రీ రఘురామచంద్ర మూ
ర్తికిఁ దగఁ బట్టభంగ సుకృతిన్ సరివచ్చిన రామనాథ శా
స్త్రికి నొక పద్యమే నొసగితిన్ గృతిగా నిఁక నేమి చేయుదున్?

- రచన 11-3-1924

శ్రీ గురజాడ అప్పారావుగారు మదరాసు వచ్చినప్పుడల్లా వారితో కలిసి 'మూగ సినిమా'లు (Silent pictures)-ఇంగ్లీషు వి-చూచేవారు ప్రభాకర శాస్త్రి గారు మదరాసు వదలిన పిమ్మట, ప్రధానంగా యోగం వారిలో వికసింప నారంభించిన తరువాత, ఆయన సినీమాలకు గాని, నాటకాలకు గాని పోవటం మే మెఱుగము.

మదరాసులో ఉండగా శాస్త్రిగారు సాహిత్యం - చరిత్ర - శాసనాలు - కవి చరిత్రలు - పరిశోధనలు - సాహిత్య విమర్శలకు సంబంధించి పెక్కు రచనలు పత్రికా ముఖంగా ప్రకటిస్తూ వచ్చారు. వారి రచనలు ప్రకటింపబడిన పత్రికలలో కొన్ని : 1. భారతి, 2. శారద, 3. కళ, 4. చంద్రిక, 5. రెడ్డిరాణి, 6. ఆంధ్రపత్రిక ఉగాది సంచిక, ఆదివారము సారస్వతాను బంధము, 7. ఆంధ్రి, 8. వేగుచుక్క, 9. దేశమాత, 10. సాహితి, 11. అభినవ సరస్వతి, 12. గృహలక్ష్మి, 13. త్రిలింగ, 14. వైజయంతి, 15. శశిరేఖ, 16. సరస్వతి (ముక్త్యాల/కాకినాడ), 17. ప్రజామత, 18. ఆనంద వాహిని, 19. ఆంధ్ర భారతి (బందరు), 20. ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక, 21. కృష్ణా పత్రిక, 22. దక్షిణాంధ్ర పత్రిక.

ప్రత్యేక సంచికలు : 1. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, 2. రెడ్డి సంచిక, 13. కాకతీయ సంచిక మొదలైనవి.

# 5. యోగప్రవేశం

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారిని ఆంధ్ర వాఙ్మయ జగత్తులో మేరు శిఖరసమానులని తెలుగునాట తెలియనివారు లేరు. ఆంధ్ర సారస్వత ప్రపంచంలో ఎంత ఎత్తుకు ఎదిగారో, అంత ఎత్తూ వారు యోగసాధనలోనూ ఎదిగిన సంగతి తొలిసారిగా 1950 ఆగస్టు 29 వ తేదీన వారు గతించిన తరువాతనే, ఆ మరునాటి 'ఆంధ్రప్రభ'లో "యోగిపుంగవులు ప్రభాకరశాస్త్రిగారి అస్తమయం" అన్న వార్తా విశేషాల్ని చూచిన తర్వాతనే తెలియటం. అంతవరకూ ఏతదనుయాయులు మాత్రమే ఎరుగుదురు. వారే దానినంత గూఢంగా ఉంచారు. శాస్త్రిగారి పూర్ణ స్వరూపం తెలియాలంటే సాహిత్య - యోగాల గూర్చి వివరంగా తెలిసికోవలసి ఉంటుంది.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు మదరాసులో ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో పనిచేస్తున్నప్పుడు 1912-16 నడుమ తీవ్రవ్యాధి బాధలకు గురి అయ్యారు. ఎన్నో దేశీయ, విదేశీయ సంబంధి వైద్యములు చేయించుకొన్నారు. దేని వల్లనూ ఆరోగ్యం కుదుటపడలేదు. నిరంతరమూ ఆందోళనే. ఆహారం సరిగా తీసికోలేక పోయేవారు. జీర్ణశక్తి మందగించింది. నిరాశా, నిస్పృహలు అలముకొన్నాయి. శారీరక, మానసిక స్వాస్థ్యాలు సన్నగిల్లాయి. ఒక దుర్బల క్షణములో ప్రాణ త్యాగ సంకల్పం కూడా వారిలో కలుగకపోలేదు. దానితో ఇక ఏ హరిద్వారానికో పోయి మహాప్రస్థాన కల్పంగా 'గంగా' ప్రవాహంలో కలిసిపోదా మని సంకల్పించి, మదరాసు రైలు స్టేషనుకు ఒంటరిగా బయలుదేరారు. త్రోవలో అక్బరు సాహెబు వీథిలో వారు పోతూండగా అబ్బూరి జగన్నాథరావుగారనే మిత్రు లెదురుపడి చేయిపట్టుకొని 'ఇలా ఉన్నారేమిటి?' అని ప్రశ్నించారు. శూన్య హృదయంతో శాస్త్రిగారు తమ మనోవ్యథ వెల్లడించారు. అప్పుడు వారే 'మా బావ గారు చేరిన యోగగోష్ఠిలో చేరితే మీ ఆరోగ్యం బాగుపడుతుంది. ఎందుకు మీరందులో చేరకూడదు?' అన్నారు. ఆ క్షణం శాస్త్రిగారి జీవితంలో ప్రధానమైన మలుపు. అదే వారి సర్వాభ్యుదయాలకూ తరువాత ఏడుగడ అయింది.

శ్రీ జగన్నాథరావుగారి బావగారు శ్రీ పోతరాజు నరసింహంగారు. వారు ఎం.ఏ.పట్టభద్రులు, ప్రెసిడెన్సి కళాశాలలో 'ఫిలాసఫీ ప్రొఫెసరు'. ఆయన మాష్టరు సి.వి.వి.గారి యోగగోష్ఠిలో సాధనచేస్తున్న పుణ్యశ్లోకులు. ఇందులో చేరటానికి శాస్త్రిగారు సమ్మతింపగా, మాష్టరుగారికి వారొక జాబు వ్రాసి ఇచ్చారు. హరిద్వారాని కుద్దేశించిన ప్రయాణం కుంభకోణం వైపు మళ్ళింది. ఆ ప్రయాణం లోనే శాస్త్రిగారిలో ఎప్పుడూ లేని ఉత్సాహపు కెరటములు ఉరకలు వేయ సాగినాయి. ఆ దివ్య యోగిపుంగవుని దర్శనానికై మనస్సు ఉవ్విళ్ళూరాత లూగ సాగింది. శాస్త్రిగారి మనస్సు ఎప్పుడెప్పు డాక్షణం వస్తుందా అని ఎదురుచూడ నారంభించింది.[1]

"లావుగాక సన్నము గాక, పొట్టి గాక మఱీ పొడుగు గాక నిమ్మపంటి చాయతో అరుణోదయకాంతులు కడలొ్కల్పుచున్న శ్రీవారిని (మాష్టరు సి.వి.వి. యోగింపుంగవులను) చూడగనే నా (శాస్త్రిగారి) యొడలు పులకరించెను". శ్రీ నరసింహం గారిచ్చిన జాబును వారి కర్పించుకొన్నారు. వారు దాన్ని చదివి, నవ్వి విశ్రాంతి తీసికొనమని చెప్పారు. నెమ్మదిమీద శాస్త్రిగారు తమ అనారోగ్యాది విషయాలు శ్రీవారికి నివేదించుకోవటం జరిగింది.

శ్రీవారి దర్శన మాత్రం చేత శాస్త్రిగారిలో ఒక గొప్ప ప్రజ్ఞ ప్రవేశించి ఊపి వేస్తున్నట్లు గోచరింపసాగింది. ఒక అపూర్వానుభూతి శాస్త్రిగారిలో విజృంభింప నారంభించింది. వారి దేహంలో మహా సంచలనం కలిగింది. తోడనే అవశులయ్యారు. శాస్త్రిగారికి చిన్నతనంలో బండి నుండి పడ్డప్పుడు రెక్కగూడు సడలింది. ఎన్నో వైద్యాలు చేయించారు కాని కుదుట పడలేదు. ఇప్పు డీ మహా సంచలనముతో, ఆ రెక్కగూడు యథా స్థానంలో కుదురుకొంది. శ్రీవారి 'ట్రీటుమెంటు'వల్ల పూర్తిగా నయమైంది. ఈ దివ్యానుభవం శాస్త్రిగారిని ఆ యోగానికి అనుసంధించింది. ప్రభాకరశాస్త్రిగారు మాష్టరు సి. వి. వి. గారు సాధనచేస్తున్న 'భృక్త రహిత తారక యోగము'లో 22-6-1916 న చేరారు.

---

1. ప్రజ్ఞా ప్రభాకరము - పుట 102.

అప్పుడు శ్రీవారి ఆదేశానుసారం 'టెస్టు' తీయవలసిందిగా వారి శిష్యులు రాధాకృష్ణ పిళ్ళె, మహాదేవ అయ్యరులను నియోగించారు. ఆ ఇద్దరు శిష్యులూ గురుదేవులకు నమస్కరించి కనులు మూసుకొన్నారు రాధాకృష్ణపిళ్ళెగారు ఒక్క నిమిషం ఆగి, ఇంగ్లీషులో గ్రంథం పఠిస్తున్నట్లేదో చెప్పసాగారు. మహాదేవ అయ్యరుగారు దాన్ని వడివడిగా సంక్షిప్త లేఖనంలో (short - hand) వ్రాయ సాగారు. పిళ్ళెగారు తమ అంతరదృష్టికి కనపడినవి, అంతర శ్రుతికి వినపడినవి చెప్ప సాగినారు. అప్పుడు శాస్త్రిగారి శరీరాంతర్భాగమున గల స్వాస్థ్యా స్వాస్థ్యములూ, మనోభావాలూ, అనారోగ్య కారణాలూ- తన్నివారణోపాయాలూ- అప్పటికి గతించిన జన్మ పరంపరలూ ఇట్లెన్నో ఆ 'టెస్టు' లో ఉన్నాయి. ఆ రోజుల్లో యోగాభ్యాసానికై వచ్చి శిష్యతానుగ్రహం పొందే వారి కందరకూ అట్టి టెస్టు తీయడం జరిగేది.[1]

ఆ నాటినుండీ, శాస్త్రిగారు భౌతిక గాత్రం విడిచే పర్యంతం నియమపూర్వక మైన దీక్షతో యోగసాధనం చేస్తూవచ్చారు. కరుణ-సానుభూతి-అనుతాపము త్రిపుటిగా ప్రభాకరశాస్త్రిగారు యోగవరిష్ఠులై జీవితం గడపారు. వారి ఆర్తసేవ-యోగచికిత్సలను గూర్చి కథలు తరువాతి ప్రకరణాల్లో వివరింపబడతాయి. అయితే ఇంత మహత్తరయోగాన్ని స్థాపించిన పురుషోత్తముని చరిత్ర కూడా కొంత తెలియుట అవసరం.

---

1. చూడు : వేటూరి వారి సారస్వత వరివస్య - పుటలు 398, 399, 400.

# 6. మహాపురుషుడు మాష్టరు సి. వి. వి.

దక్షిణ భారతదేశంలో కుంభకోణంలో కంచుపాటి వేంకాసామిరావు గారు 4-8-1868న శ్రావణ పూర్ణిమ నాడు ధనిష్టా నక్షత్రంలో జన్మించారు. తెలుగు నాటినుండి శ్రీకృష్ణదేవరాయల కాలంలో దక్షిణదేశానికి తరలివెళ్ళిన ఆంధ్ర నియోగి బ్రాహ్మణ కుటుంబాల్లో వీరి దొకటి. వీరి దెప్పుడో ప గో. జిల్లాలోని కంచుమర్రు· కలిగిన కుటుంబం. కావేరీతీరంలో కుంభకోణమందున్న భగవద్ఘట్టమున వీరికి ఎన్నో ఇండ్లుండేవి. ఆ రోజుల్లో నాలుగైదు లక్షలు కిమ్మతు చేసే ఆస్తి. వీరు మేనత్తకు దత్తుపోయినారు. శ్రీరంగంలో, కుంభకోణంలో విద్య నేర్చుకొన్నారు. కొంతకాలం కుంభకోణం మునిసిపాలిటీకి అధ్యక్షులు కూడా! వస్తుతః మహాభోగులు. దర్భాంగా మహారాజు కుంభకోణం రాగా, వీరు చైర్మనుగా ఉన్నప్పుడు స్వంత ధన మెంతో వెచ్చించి 132 పిండివంటలతో మహారాజావారికి ఆతిథ్యమిచ్చారు. రైల్వేకాంట్రాక్టు చేసి ఎంతో ఆస్తిని పోగొట్టుకొన్నారు. పన్నెండవ యేట రుక్మిణమ్మ గారిని వివాహ మాడారు. శ్రీ వేంకటసామిరావుగారి 38వ ఏట ఆమె గతించింది. అది 1906వ సం॥రము. ఆ తర్వాత మద్రాసు వాస్తవ్యులైన మద్దూరి అప్పయ్య పంతులు గారి కుమార్తె 'వెంకమ్మ'గారిని 1906 లో రెండవ వివాహమాడారు. ఆ వివాహము తిరుపతిలో జరిగింది. అంత సంపన్న జీవితము గడపినా, వారిలో అంతర్వాహినిగా ఆధ్యాత్మికత వర్తిల్లేది. దివ్య జ్ఞాన సమాజంలో సభ్యులై దైవచింతనతో కొంత కాలం గడిపారు.

ఇదిలా ఉండగా 1910 లో 'హేలీస్' అను పేరు గల తోకచుక్క ఒకటి కనపడింది. దాని తోకనుండి ఒక కాంతి పుంజం దూసుకొని వీరున్న గదిలోకి ప్రవేశింపగానే, గది అంతా విద్యున్మయ మయింది. పెద్ద బ్రహ్మాండమైన ధ్వని వినబడింది. అదొక 'ఫ్యాక్టరీ హోరు' అని పుర ప్రజలు భావించారు. ఆ వెలుగు రేఖ శ్రీ వేంకాసామిరావుగారిలో ప్రవేశించింది. తోడనే బ్రహ్మజిజ్ఞాస కలిగింది. తమను తాము తెలిసికొన్నారు. సమాధి స్థితి ఏర్పడింది. ఆ క్షణంలోనే యోగ సాధన ఆరంభించారు. ఆయనయే మాష్టరు సి.వి.వి. అయ్యారు. వారి నామాక్ష

రాలు మూడు సి.వి.వి. అన్నవి బీజాక్షరా లయ్యాయి వారుపదేశించిన 'భృక్తరహిత తారక రాజయోగమున' కిదే మూలమంత్రం.

శ్రీ వారిని గూర్చి ధ్రువనాడి ఇలా చెబుతున్నది: "ఆత్మజ్ఞాన పరాయణోఽతి నిపుణో బౌద్ధ ప్రధానో గుణీ/బ్రహ్మలోకాది వృత్తాంతం వేత్తి యోగ ప్రభావతః".

మానవ జీవన పరిణామంలో మానవుని దైవత్వ స్థితికి తీసికొని పోవడానికి పరబ్రహ్మాంశాన్ని తీసికొని వచ్చిన మహానుభావుడు. బహిర్ముఖంగా సాగుతున్న బహుత్వాన్ని సాగనిస్తూనే, అంతర్ముఖంగా తిరిగి, అందులో ఏకత్వాన్ని గుర్తించి వర్తించటం ఈ యోగ సాధన కొక ఫలితం. మృత్యువును ధిక్కరించే శక్తి సామర్థ్యాలు (అందరకూ) కలగాలనీ, అమరత్వ సిద్ధి కలగాలనీ, ఆ అమరత్వ సిద్ధి ఇచ్చటనే ఈ శరీరంలోనే మనం పొందాలనీ ఆశించి యోగ సాధన చేసిన మహనీయుడు. ఇందు లోక శ్రేయమే లక్ష్యం గాని వైయక్తిక మోక్షం మాత్రం కాదు. సృష్టిలో ఉన్న లోటు పాట్లను గూడ సవరించుట ఈ యోగ లక్ష్యం. 1910 మే నెల 29 వ తేదీన రాత్రి 8-30 గంటలకు మాష్టరు సి.వి.వి. గారీ నవీన యోగాని కంకురార్పణ చేశారు. వారు స్వయంగా 752 మందికి (616 గురు పురుషులు, 136 మంది స్త్రీలు) ఉపదేశ మిచ్చారు. ఇందులో అన్ని మతాల వారూ, తెగలవారూ ఉన్నారు. ఈ యోగం ఆరంభించిన నాటినుండీ మాష్టరు సి. వి. వి. గారు 11 సంవత్సరముల, 11 మాసముల, 11 రోజుల, 11 గంటల, 11 నిమిషముల కాలము భౌతిక శరీరమందుండి ఈ యోగసాధన చేయించారు. 12-5-1922 న ఈ మహాయోగి స్వగృహములో దేహ త్యాగము చేశారు వీరు సంగీత ప్రియులు. కర్ణాటక సంగీతంలో ప్రవేశ మే కాక, ఫిడేలు, వీణ మొదలైన వాద్యాలు శ్రావ్యంగా వినిపించేవారు తెలుగు - తమిళ - ఆంగ్ల, సంస్కృత భాషల్లో సమంచిత పాండిత్యం గడించారు ప్రతిభా సముద్రులు. అంతరుద్భోధమే వారు నెలపిన యోగమునకు కీలకం.

తన నాశ్రయించిన వారిని తనంత వారిగా చేస్తానని ఆయన ప్రతిజ్ఞ. అనేక దివ్య శక్తులను సంపాదించినారు. ఈ యోగశక్తి ప్రభావంవల్ల ఎందరి

ఆధి వ్యాధులనో సంకల్ప మాత్రంచేత పారద్రోలిన మహాభాగులు. అట్లా ఆరోగ్యలబ్ధి పొందినవారే శ్రీ ప్రభాకర శాస్త్రిగారు.

ఉభయ సంధ్యలలోనూ సరిగా 6 గంటలకు ఈ యోగసాధకులు శ్రీవారి నామాక్షరములు జపించి యోగసాధన చేస్తారు. ఈ నాడు మాష్టరు యోగానుష్ఠానము నియతి తప్పక చేసేవారు భారతదేశంలోనే గాక బెల్జియం, ఇటలీ, ఫ్రాన్సు, ఇంగ్లండు, అమెరికా, స్విట్జర్లాండు మొదలైన ప్రపంచ దేశాలెన్నింటిలోనో లక్షల కొద్దీ మంది ఉన్నారు. మాష్టరు సి వి.వి. గారి ప్రత్యేక శిష్యులలో వెలగపూడి సుబ్బారావు (బాపట్ల), మైనంపాటి నరసింహం (ఒంగోలు), టంగుటూరి జానకిరాం (ప్రకాశం గారి సోదరులు), రాచకొండ నారాయణమూర్తి (విశాఖ) మొదలైన తెలుగు వారెందరో ఉండేవారు.

# 7. కవితలు

'కకవనార్థ మ్ముదయించితిన్ సుకవితా కార్యంబె నావృత్తి' అని ధీర గంభీరంగా చాటుకొన్న శతావధాని, అద్యతనాంధ్ర కవి ప్రపంచ నిర్మాత చెళ్ళ పిళ్ళ వెంకటశాస్త్రిగారు ప్రభాకరశాస్త్రిగారికి కవితా గురువులూ, సాహిత్య దేశికులూను! కవితా రహస్యా లెన్నో గురువువల్ల నేర్చుకొన్నారు. ఆ గురువుల నిట్లు శ్లాఘించారు శాస్త్రిగారు.

ఉ॥ వేంకటశాస్త్రి పండిత కవి ప్రభు పాదము లాశ్రయించి, ని
శ్శంకముగా గడించితిమి శక్త్యనుసారము సంస్కృతాంధ్ర కూ
లంకష పాండితిన్, కవన లాఘవమున్, బటు శబ్ద శాస్త్రమున్
జంకము మేము, మత్కవిత సర్వము తత్కరుణాత్తమే చుఁడీ!

ప్రభాకరశాస్త్రిగారిలో కవితాంకురం చిన్ననాటనే పొటమరించింది. తమ పదునాల్గో ఏట ఎడ్వర్డు పట్టాభిషేకంపై కొన్ని శ్లోకాలు రచించి, గురువులు అద్దేపల్లి సోమనాథశాస్త్రిలవారి మెప్పును చూఱగొన్నారు. ఇరువయ్యేళ్ళ ప్రాయంలో పనప్పాకం అనంతచార్యుల వారిచే అనుకుంటాను, 'కవి చూడామణి' బిరుదు పొందారు - వారిని కవితలో మెప్పించి. బాల్యంలో శతావధాన, అష్టావధానాలు చేశారు. వారిలో కవితా శిల్పం సల్పాలనే వేడుకలు ఎసరేగినాయి. వారి కవిత్వాన్నంతటినీ 1. ఖండ కావ్యాలు, 2. అనిబద్ధ రచనలు, 3 అనువాదములు అను మూడు విధాలుగా వింగడింపవచ్చును :

## ఖండ కావ్యాలు :

1. మూన్నాళ్ళ ముచ్చట : శాస్త్రిగారి కావ్యేతి వృత్తాలు ముప్పాలు, ముప్వీసము తాము విన్నవీ, కన్నవీ, వాస్తవములైనవీను. ఆలు మగల సుఖ జీవనము, భర్త దురావేశముతో మోహితు దవడం, తర్వాత హితోపదేశమున్న 91 పద్యాలు గల లఘుకృతి. ఇందులో శాస్త్రిగారు ప్రయోగించిన 'వారవాణము' వంటి వానిని 'అభినవ మల్లినాథ' బిరుదాంకితులైన వేదం వేంకట్రాయ శాస్త్రిగారు

తమ వ్యాఖ్యానాలలో ప్రమాణాలుగా తీసికొన్నారు. శాస్త్రిగారి పద ప్రయోగాలలోని ప్రామాణికతకు అది నిదర్శనం. "ఇందలి కవిత్వము చవి గల ఆంధ్ర ప్రబంధరాజముల చక్కం జదివి చదివి యందలి యందచందముల రుచి పొందె టిగిన యభిజ్ఞుని రసోదంచితము, రామణీయకము అగు రచనము"[1] అని శ్లాఘింపబడింది.

2. ఆ తరువాత 'అలవాటు' (1923) ఇరువది యొక్క పద్యముల చిన్ని కథా కావ్యము. పిల్లల చిత్తవృత్తులు, తలిదండ్రుల మనస్తత్త్వాలు ఇందులో స్వభావసుందరంగా అభివర్ణింపబడినాయి.

3. దివ్య దర్శనము (1924): తాత్త్విక కవితాశాఖకు సంబంధించినది. ఈశ్వర తత్త్వచింతనా లౌల్యములో ఉన్న అకలంకుడు, జిజ్ఞాసువు అయిన వాని అనుభూతులను తెలియజేస్తూ, 108 గద్య పద్యాలలో కమనీయంగా రచింపబడిన కావ్యం. క్రాంతదర్శియైన సుకవి తనలో కనుపించీ కనుపించనట్లుగా వెలుగులు గొల్పే తత్త్వాన్ని వ్యక్తావ్యక్త వాక్కులతో వ్యంగ్య మర్యాదతోనే సామాజికులకు స్ఫురింపజేసిన మహోన్నత కావ్యం. సత్యద్రష్ట కల్పన జోలికి పోదని నమ్మిన కవి శాస్త్రిగారు. ఇందులో విజయవాడ వర్ణన, దేవీ దర్శనము, ఆంధ్రదేశ వర్ణన ముచ్చట గొల్పే రీతిలో నడిచాయి. తెఱచాటుగా ఈ కావ్యంలో శాస్త్రిగారే దర్శనమిస్తారు. వారి అనుభూతులే ఇందులో ధ్వనిత మయ్యాయి. అధ్యాత్మ విద్యా రహస్యమైన ప్రజ్ఞ ఇందులో మెఱుగులు చిమ్మింది. ఒక పద్యము :

శా॥ చక్షుర్గోచరమైన యీజగతికిం జాలై, యనేకాద్భుత
ప్రేక్షాలక్షిత మెంతయేన్ గలదు, తద్విజ్ఞానసర్వస్వమున్
లక్షింపందగు శక్తి మర్త్యులకు గల్గన్‌లేదు ............ ... (22వ పుట)

తాత్త్విక కవులలో వీరికి సమున్నత స్థానము కల్పించిన దీ కావ్యము.

4. కడుపు తీపు (1925) : కరుణరస ప్రధానకమైన వాస్తవసంఘటన ఇందులోని కథ. ఇందులో ఒక ఉద్యోగి, తన భార్యాపిల్లలతో సుఖజీవనం చేస్తూం

---

1. 1924 సెప్టెంబరు - భారతి.

డగా ఒకనాటి ఉదయం కృష్ణవేణిలో కుటుంబమంతా స్నానాలు చేస్తుంది. వరదల నీటిలో ఒక దుంగకొట్టుకొని రాగా, ఆ ఇల్లాలు దాన్ని నీటిలోనికి త్రోసింది. మిల మిల మెఱసి నక్లైంది. ఆ మెరసినది పాము. అది ఆ రాత్రి పగపట్టి పిల్లలతో నిద్రిస్తున్న ఇల్లాలిని కసిగాట్లు వేసి చంపినది. పిల్లల రక్షణకై ప్రాణాలు బలిదానం చేసిన మాతృమూర్తి కథ. కృష్ణాతీరాంధ్రదేశ వైభవం దీంట్లో ప్రాస్తావికంగా వర్ణింపబడింది. సమకాలీన నాగరక సమాజంపై విసుర్లు ఉన్నా యిందులో. చవులూరించు గోగుపచ్చడి వర్ణన :

ఆ॥వె॥ పయర కూర వేచి, పచ్చిమిరెప పండ్ల
నుక్కళించి పోసి, యూరనిచ్చి
కొంత కొంత పొగపికొని గోగుపచ్చడి
చవికి, నింక నోరు చివికి తీరు. (44 వ పద్యము)

పూర్వకవి ప్రయోగదక్షత నిరూపించు పద్యాలు ఇందులో ఎన్నో ఉన్నాయి. శ్రీ ప్రభాకర శాస్త్రిగారు ప్రాచీనులలో నవీనులు, నవీనులలో ప్రాచీనులు.

5. కపోత కథ (1925) : మూడు పూటలలో ఆశువుగా రచించిన 93 గద్య పద్యాలున్న కృతి. 'లుబ్ధకపోతోపాఖ్యానము' దీనికాధారం. ఇందులో శాస్త్రిగారు కావ్య సందేశాన్ని ఇట్లా వెల్లడించారు:

ఉ॥ ఎవ్వడు ధర్మ సక్తుడయి యాశ్వర తత్పరుడై స్వయత్నముల్
గవ్వకు కూడ మారవని కన్గొని, యార్తుల రక్షణార్థులన్
నెవ్వగ నుండి కావఁదన నేర్చును, భాగ్యము వెచ్చ పెట్టునో
అవ్వరణీయ వర్తనున కబ్బును నిందును నందు సౌఖ్యముల్ (పుట 26)

6. విశ్వాసము (1926) : 58 గీతములు, 6 కందములతో ఉన్న కృతి. శాస్త్రిగారి హృదయగ్రంథిని కదల్చి కరగించిన వాస్తవ సన్నివేశం ఈ రచనకు ప్రేరణ. కరుణ ఊపిరిగా నడచిన లఘు కావ్యం. ఒక కుక్క ఉప్పరి యెడల విశ్వాసంతో ప్రాణాలర్పించిన కరుణామయ గాథ. కథ రక్తికట్టించడానికి

ఇందులో కూర్చిన ప్రతియోగ ఘట్టం మనస్సును పట్టుకొని వదలదు. ఉప్పరిని విడువ నొల్లని కుక్క తీరు స్వభావ సుందరంగా వర్ణింపబడింది :

ఆ.వె. కనుల నీరు నించుఁ గనుగొంచు, నుప్పరీ
డెచ్చరించు, కుక్క యెగిరి కొంచుఁ
బైకి రాఁ బ్రయత్నపడు, క్రిందఁబడుఁ గొంత
దూర మరుగు, మరలఁ జేరుకొనును (పుట. 9)

కావ్య మాద్యంతం చదివిన పాఠకుడు కన్నీరు దొనదొన కారేలాగా ఏడ్చి, ఒక్కతూరిగా నిట్టూరుస్తాడు. విశ్వనాథ వారు రామాయణ కల్పవృక్షంలో అన్నట్లు 'కవి ప్రతిభలోనుండును గావ్యగత శతాంశములయందుఁ దొంబదియైన పాళ్ళు' అనే దానికి ఈ రచన తార్కాణం.

7. చిన్ననాటి చేష్టలు (1928) : అరవైఆరు పద్యాలున్న లఘుకృతి. శ్రీ ప్రభాకరశాస్త్రిగారి చిన్ననాటి అనుభవా లిందులో ఉన్నాయి. కృష్ణాతీర శోభ, గ్రామ జీవిత రామణీయకం, జాతర్ల వైభవాలు, బాల్య స్మృతులూ, బొమ్మ లాటలూ వివరింపబడ్డాయి. ఒకనాటి సంబరము 'రెండు కనులలోఁ చాలకయుండె నాకు' అన్నారు ఎంతో ముచ్చటగా! ఈ తీరు రచన కాద్యులు శ్రీ శాస్త్రిగారే. అటుపిమ్మట కాటూరివారి 'నేను', పింగళివారి 'ఆత్మ లహరి' వచ్చిన సంగతి లోక మెఱిగిందే.

8. సీతాఫలము (1940) : రగడ ఛందంలో గేయఫణితిలో రచింప బడ్డ కథ. బాల సాహిత్య శాఖకు చెందింది. సీతాఫలము పచ్చికాయ తెచ్చి పండవు తుందేమో అని ముగ్గబెట్టిన బాలుని చిత్తవృత్తి ఇందులో చెప్పబడింది.

9 మాతృశ్రీ (1944): ధర్మపరిపుష్టమైన మాతృ హృదయ మందులో అవిష్కరింపబడింది. యోగానుభూతికి అక్షరాకృతి ఈ రచన. సత్య దిదృక్ష చిరంతన చిత్త వ్యాపారము. అదే ఈ రచనకు ప్రేరణ.

10. సత్రశాల : ఈ ఖండ కావ్యాన్ని 1988 లో ఆంధ్ర ప్రభ వార పత్రికలో ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు సేకరించి ప్రకటించారు.

## అనిబద్ధ రచనలు :

ఒక అర్ధ శతాబ్ది పాటు అవిచ్ఛిన్నంగా వేర్వేరు విషయాలపై వ్రాసిన కవిత లివి. ఇప్పటివరకూ సేకరించినవి 47 ఖండములు. ముక్తకములు హెచ్చు ఇందులో కొన్ని రసవ్యగ్రమైనవి. కొన్ని వినోదాత్మక మైనవి. మరికొన్ని పరిహాసపు జల్లులు. అన్నింటిలోను శాస్త్రిగారి ప్రతిభా చక్షువు కాన వస్తూనే ఉంటుంది. అలాటి ఛందస్సుందర రచనలను పలు విధాలుగా వింగ డింపవచ్చును : 1. జీవితానుభూతులు, 2. కవి ప్రశస్తులు, 3. రాజప్రశస్తులు 4. జాతీయభావ పూరితములు, 5. సమస్యా పూరణలు, 6 జాబులలో కైతలు, 7. స్మృతులు, 8. వ్యాఖ్యాన ప్రాయాలు, 9. ఆశువులు, 10. ప్రాస్తావికాలు-ఇలా విడదీయవచ్చు-ఇందులో కొన్ని ఛందస్సుందరాలూ, మరికొన్ని గేయాత్మకాలున్నూ. పారిజాతపు తావి గుబాళించినట్లున్న తంజపురి కన్నెలపై చెప్పిన చాటువు:

చం॥ చిలుపని తావులుం జవులు చిమ్మెడు కమ్మని పూవుఁదీవలో
వలగొని గానలక్ష్మి నిలువన్ జెలువమ్ములు నించు రూప రే
ఖలొ యనునట్లు తంజపురిఁ గన్నెలు కొందరు గొబ్బిపాట మె
చ్చు లొలుక వీనులం గనులఁ జుబ్బన చూఱలు జుఱ్ఱి పొంగితిన్ (1914)

'ముగ్ధ' అను పదంతో ఆరంభమయి, 'దుగ్ధము' పదం నిషేధిస్తూ పద్దెము రచించమని మిత్రు లొకరు కోరగా చెప్పినది:

ఉ॥ ముగ్ధ! ఇదేటి మాటలు? విమోహితులై నిను గాంచినంత, సం
దిగ్ధ మనస్కులై, తుదకు తేకువ జారగ, బీద బేలనై
స్నిగ్ధములైన నీదు నును జెక్కులఁ జన్గవ నొక్క గోరుచున్
దగ్ధ సుమాస్త్రినంత బలుదంటలునున్ నిను వెంట నంటరే? (1911)

బుద్ధ భగవానునిపై చెప్పిన ఈ చాటువు శాస్త్రిగారికి అత్యంత ప్రియము:

చం॥ ప్రియయువతిం బ్రభుత్వమును వీడి యరణ్యమునందు తత్త్వ ని
శ్చయమునకై మహాతపము సల్పి, కృతార్థతఁగాంచె నెల్లెడన్
దయయు నహింసయున్ పరమ ధర్మములన్ నెలకొల్పె, నమ్మహో
దయుడగు బుద్ధదేవుని పదంబుల కేను నమస్కరించెదన్.

'నూతన వర్ష'మన్న పేరుతో షడృతువులను అభివర్ణించారు. అందులో వసంతంపై-

చం॥ మలయ సమీర సౌరభ సమంచితముల్ సుఖభుక్త మత్త సం
కుల కల కాకలీ కలిత కూజిత కోకిల మంజుగానముల్
దళిత మనోజ్ఞ కుట్మల వితాన లతా నయన ప్రమోద నో
జ్జ్వలములు నవ్య వార్షిక వసంత దినమ్ములు మిమ్ముఁదన్పుతన్! (1911)

'శరణార్థి' అను పేర గేయాలు రచించారు. జిజ్ఞాసువు, అర్ధాంగలక్ష్మి, మదరాసు కాపురము, పెండ్లి ముచ్చట ఈ తీరుగా ఆ యా ముక్తక రచనలు కమనీయ ఫణితిలో కూర్పబడినాయి.

**అనువాదాలు :** 1. హాలుని గాథా సప్తశతినుండి అప్పు డప్పుడు కొన్ని గాథలు తెలిగించారు అటువంటివి మొత్తం పద్దెనిమిది. గ్రామీణ జీవన సరణిని మెచ్చుకొను స్వభావం గల శాస్త్రిగారు ముచ్చటపడి అనువదించి ఉంటా రనుకొంటాను.

'పాద పతితస్య పృష్ఠం పుత్రే సమారుహతి ।
దృఢమన్యు దూనాయాఽపి హాసో గృహిణ్యా నిష్క్రాంతః'॥

దీని తెలిగింపు-

ఆ. వె. కాళ్ళమీఁదఁబడి మగఁడు వేడుకొన, వీపు
గుఱ్ఱ మెక్కి యాడెఁ గుఱ్ఱవాఁడు
అల్గి యేడ్పు న్నాగ్రహము డొల్లగిల్లి యి
ల్లాలి కంత నవ్వు రాలువాఱె -

మూలాతిశయమైన తెనిగింపు.

2 'ప్రతాపరుద్ర కళ్యాణము' నుండి మూడు శ్లోకాలు తెనిగించారు (1924).

3. **సప్తపదులు :** ద్రావిడ భాషనుండి 'తిరుప్పావై'ని 1925 లో తెనిగించి తొలుత 'స్వధర్మ ప్రకాశిని' పత్రికలో ప్రచురించగా, దీనినే మళ్ళీ తి. తి. దేవస్థానం వారు 1950 లో పునర్ముద్రించారు. ఈ సప్తపదులే ఈ నాటికీ ధనుర్మాసంలో హైదరాబాదు, విజయవాడ ఆకాశవాణి కేంద్రాల నుండి ప్రసారం కావడం దీని విశిష్టతను చెప్పక చెప్పుతున్నది. ఇందులో తొలి పది పాశురాలు ఎప్పుడో శ్రీనివాస గురుడు తెలిగింపగా, మిగిలిన ఇరువదింటిని శాస్త్రిగా రనువదించారు.

4. **గోవర్ధన సప్తశతి (1928) :** రచయిత గోవర్ధనుడు. 'ఆర్యా సప్తశతి' అని కూడా దీని నంటారు. దీనినుండి పది శ్లోకా లెన్నుకొని తెనిగించారు. దీన్ని పూర్తిగా అనువదించిన వారిలో గడియారం వేంకటశేషశాస్త్రిగా రొక్కరు.

5. **సనత్ సుజాతీయము :** వ్యాస భారతంలో మృత్యు, అమృత్యు దశలను గురించి ధృతరాష్ట్రునకు సనత్ సుజాతుడు ఎఱిగించిన కథ మూలం ఆరధ్యాయాలలో ఉండగా, వేటూరివారు తొలి అధ్యాయం మాత్రమే తెనిగించారు. అమృతత్వ సిద్ధి ఇందలి ప్రతిపాద్య వస్తువు. తిక్కన భారతాంధ్రీకరణంలో ఇది పరిహరింపబడింది. అనువదించటంలో శంకరుల వ్యాఖ్యానాన్ని కూడా శాస్త్రిగారు సంప్రదించారు.

6. **వేణీ పంచకము (1923) :** ఇది అజ్ఞాత కర్తృకం. దీన్ని శాస్త్రిగా రనువదించి సరస్వతి (ముక్త్యాల) పత్రికలో ప్రచురించారు. ఇట్టివే సంస్కృతంలో భృంగ, వృశ్చిక, పానీయాది పంచకము లెన్నో ఉన్నాయి.

7. **పండిత రాయల చాటువులు :** జగన్నాథ పండిత రాయలు అన్యాపదేశంగా చెప్పిన రెండు శ్లోకాలను 'మాగర్వ', 'దిగంతే శ్రూయంతే' ఇత్యాదిగా గల వాటిని అనువదించి (1940) ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రచురించారు.

8. **భజగోవింద శ్లోకములు (1929):** ఇరువది యేడు శ్లోకాలకు గేయానువాదం ఇది.

వేటూరి వారి కవితా హృదయం స్పందన శీలం గలది. వైపుల్యం కంటె వైశిష్ట్యం ఎక్కువ. మరంద ప్రవాహంలా సాగిపోయే రచన. అకృత్రిమమైన శైలీ సంవిధానం, బింకం బొంకం గల పదబంధాల యోజన, పూర్వ కవీశ్వర వాక్ ప్రయోగ దక్షత, తెలుగు నుడికారపు సొంపు వీరి కవితా లక్షణాలు. ప్రతి కవితా ఖండం సద్యోహృద్యమై సహృదయ నైవేద్యమైనది. ఆచార్య యస్వీ. జోగారావు గారన్నట్లు వేటూరి 'వాగ్వశీకృత సరస్వతి'. 'నాకు నచ్చునట్లుగా మరల కవిత్వము చెప్పగలవాడు మా ప్రభాకర మొక్కడే' అని చెళ్ళపిళ్ళ వారి తీర్పు. కవిత ఎదిగినకొలదీ భావాలూ పరిణతి చెందుతూ వచ్చినాయి. క్రమశః శిల్పం కంటె సత్యం ప్రాధాన్యం వహించింది. 'జయంతి తే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః.'

# 8. రూపకానువాదాలు

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు కవితా కళను సుసంపన్నమొనర్చినట్లే రూపక ప్రక్రియకును పుష్టిని గూర్చినారు. గడిదేరిన ఉభయభాషా సారస్వత పాండిత్యాలు గలవారగుట ఇందును ప్రశస్తిని గడించినారు.

1. ప్రతిమ (1910) : భాసుని నాటకాలింకా అచ్చులోకి రాకపూర్వం తిరువనంతపుర గ్రంథాలయంలో ఉన్న తాటాకు ప్రతులకు 'కాపీ'లు వ్రాసుకొని కొన్నింటిని తెనిగించారు. అందులో మొట్టమొదటిది ప్రతిమ.[1] తరువాత పెక్కుమంది విద్వాంసులీ నాటకాన్ని ఆంధ్రీకరించారు కాళిదాసు భాసు ననుకరించిన పట్టులు పీఠికలో వెల్లడింపబడ్డాయి. ఇందొక విశేష మేమంటే ఈ నాటకానువాదంలో వ్యావహారిక భాషను ప్రవేశపెట్టినారు. భరతుడు స్పష్టీకరించినట్లుగా 'లోక భాషల బలాబలములను పరిశీలించి, మృదుశబ్దమును, సులభార్థమును అగునట్లుగా' నాటకం రచింపబడవలెను. వీరికి పూర్వులు కొందరు వ్యావహారికాన్ని నాటకాల్లో వాడకపోలేదు. వారిలో ఎన్నో మతభేదము లున్నాయి. శ్రీ శాస్త్రిగారు మూలంలో ప్రాకృతం ఉన్న పట్టుల్లో అనువాదంలో వ్యావహారికభాషనే వాడారు. ఆ రోజుల్లో ఇదొక ప్రయోగమే. జ్ఞాతశిల్పియైన కవి ఉద్దేశించిన శిల్పరహస్యాల నెఱిగి, వాని ననువాదంలో తెచ్చుకొన్నవారు ప్రభాకరులు. అనువాద భాష కృతకంగా ఉండక పోవుట వేటూరివారి ప్రత్యేకత !

2. కర్ణ భారము (1913) : ఇది దశవిధ రూపకాల్లో 'వ్యాయోగా'నికి సంబంధించింది. ఏకదివస చరిత్రమున కిది పరిమితం. అనువాదం తెలుగున మొలచినట్లుగా చేయటంలో శాస్త్రిగారు జాణలు.

3. మధ్యమ వ్యాయోగము (1913) : చమత్కృతి మెండుగా ఉన్న కృతి. మూలం లాగున అనువాదమున్నూ ప్రసన్నం. భాసుని అడుగుల్లో అడు

---

1. అచ్చుపడినది (1927)

గులు వేస్తూ పయనించారు. వారి వినయాన్ని చాటే పల్కులు గమనింపదగ్గవి. "ఇందు స్వారస్యమునకు భాసమహాకవిని మెచ్చుడు. వైరస్య మొదవెనే నాయది 'నాయది'". మూలగ్రంథ సంప్రదాయాలు వేనిని జారవిడువని చక్కని అనువాదం.

4. **మత్త విలాసము :** పల్లవ మహారాజు మహేంద్రవర్మ దీనికి కర్త. ప్రతిమానువాదంలో లాగే ఇందులో కూడా ప్రాకృతం ఉన్నచోట వ్యావహారికం ప్రయోగింపబడింది. దీనిని వేటూరి వారు ఆంధ్రీకరించినట్లు కనిపించదు. అనువాద రీతి కొక్క పద్యము :

ఉ॥ భామిని చెక్కుటద్దములపైఁ బులకల్ మొలకెత్తెఁ, గన్బొమల్
వామములై రహించె, జిగివాతెఱపై నును నవ్వువెన్నెలల్
ప్రామికొనెన్, సు దుర్లభపు భాగ్యము నా కిటువంటి నీదు నె
మ్మోము లభించెఁ జెందఁదగు భోగ్యము నాకిఁక నేమి కల్గెడిన్?

5. **భగవదజ్జుకము (1924) :** కర్త బోధాయనుడు. క్రీ.శ. 6 వ శతాబ్దికి పూర్వుడు. జీవాత్మ, పరమాత్మ, కుండలినీశక్తి ప్రతి రూపాలైన శిష్య, పరివ్రాజక, గణికలను రంగస్థలంపై ఆడించి దుర్గ్రహమైన యోగమార్గాన్ని పామరులకు కన్నులకు చూపినవాడు బోధాయనుడు. పరిహాస బంధురత ఇందులో ఎక్కువ. వినోదాన్ని కల్పించే ప్రహసన మిది. ఔచితీ పోషకాలైన భిన్న ఛందస్సులను ఇందు శాస్త్రిగారెన్నుకొన్నారు. వ్యావహారిక భాషకు మచ్చు తునక: "నాకు మల్లె పెద్దన్నయ్యల్లే ఉన్నాడు చూడగా!" కొన్నిచోట్ల సంస్కృత శ్లోకాలకు గేయానువాద మొనర్చి సన్నివేశానికి శోభ కూర్చినారు.

6. **నాగానందము :** శ్రీహర్షుడు (క్రీ.శ. 7 వ శతాబ్ది) దీన్ని రచించాడు. ఇందులో రెండంకాలు మాత్రమే ప్రభాకర శాస్త్రిగారు అనువదింపగా, పరిశిష్టాన్ని ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు పూరించారు. ఈ అనువాదాన్ని గూర్చి శ్రీ బులుసు వేంకట రమణయ్యగా రిట్లు వ్రాశారు. "ప్రతిభా పాండిత్య

ములతో బాటు ఆ యా పాత్రల మనస్తత్త్వము నవగాహన చేసికొని, వాటిలో లీనమయి, నాటక ప్రధాన ప్రతిపాద్యములగు శాంతమును, అహింసా తత్త్వమును వ్యక్తము చేయగల సామర్థ్యము శ్రీ శాస్త్రుల వారి వంటి ఏ కొద్ది మందిలోనో మాత్రమే కలదు. పరుల బాధల నివారించుటకై ఆత్మార్పణ మొనరించిన శ్రీ శాస్త్రులుగారు నాగానందము తెనిగింపఁ బూనుట ఎంతయుఁ బ్రశంసనీయము".

మక్కికి మక్కి మూల పదాలను శాస్త్రిగారు వాడరు. సహృదయావర్జకమైన భాషనే ఉపయోగిస్తారు. మూలానికి మెఱుగులు పెట్టినట్లుండటం, చవులూరించే తెలుగు పలుకుబడులూ, నుడికారాలూ ప్రయోగించటం, సంప్రదాయాల్ని జారవిడవకుండటం వీరి లక్షణం. సంస్కృత నాటకానువాదకులలో శాస్త్రిగారి స్థానం విశిష్టమైన దనటంలో సందేహం లేదు.

# 9. పరిశోధన

'భాషా విషయంలో పరిశోధన, శాసన విషయంలో పరిశోధన, చరిత్ర విషయంలో పరిశోధన - నాకు చూడగా శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చేసినది పరిశోధనే.... మూడు మూర్తులా ఆయన పరిశోధకుడు, మూర్తీభవించిన పరిశోధన ఆయన!' ఈ మాటలు ఎవరో అన్నవి కావు. పరిశోధనకే జీవితాన్ని ఒడ్డిన మల్లంపల్లి సోమశేఖరశర్మగారి మాటలు ఇవి.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తెలుగు భాషా పరిశోధన రంగంలో ప్రాగ్రేసరులయి శాస్త్రీయ దృక్పథంతో మౌలిక ప్రతిభతో దక్షిణ దేశభాషా సారస్వత సమగ్ర పరిజ్ఞానంతో ప్రవేశించారు. డా॥ కట్టమంచి, కందుకూరి, గిడుగు రామమూర్తి ప్రభృతులు కొద్దిమంది ఆ దిశగా పయనించి కొన్ని క్రొత్త త్రోవలు తీసినవారు ఉన్నారు. అయితే పరిశోధనకు ఆధార గ్రంథాలు కావాలని గుర్తించి, యత్నించి కృషిచేసినవారు శాస్త్రిగారు. నలిగిన బాటను నడువక క్రొత్తదారు లన్వేషించి వెలయించారు. అనాదృత వాఙ్మయాన్ని వెలికి దీసి, దాని విలువలు కట్టినారు. జానపద దేశి సారస్వతాలను వెలికి గొనిరావటం జరిగింది. చరిత్రను శోధించి గ్రంథాలు రచించారు. శాసన పరిష్కారాలు గావించారు. భాషాశాస్త్రాన్ని సమీక్షించి అరసున్న, శిథిలద్విత్వ నిరూపణలు కావించారు. ఎప్పుడు కలం పట్టినా క్రొత్త సంగతులు త్రవ్వి రాశి పోస్తారు. గ్రంథ పరిష్కరణలో వారి శోధన మనకు సుస్పష్టంగా కనిపిస్తుంది.

1. సంకలన గ్రంథ ప్రచురణ : శ్రీ శాస్త్రిగారి పరిశోధనకు తొలిపూజ సంకలన గ్రంథ ప్రచురణంతోనే : 1. చాటు పద్య మణిమంజరి (1913). దేవతా స్తుతులు, అవతారస్తుతులు, సంకీర్ణ పద్యా లిందున్నాయి. చిక్కదేవరాయలపై చాటువులు, వెలుగోటివారివి, రెడ్డిరాజులవి, తంజాపూరు ప్రభులవి, సి.పి. బ్రౌనుదొరపై కూర్చినవి చాటువులు ఇందు చోటుచేసుకొన్నాయి. ఇందులో కొన్ని చాటువులు చరిత్ర శోధన కుపయోగించినాయి. అల్లాడ వేమభూ విభునిపై ప్రకటించిన చాటువు 'దండయాత్రా ఘోష' ఇత్యాది పద్యాలు ప్రకటింపబడటం

వల్ల రెడ్డి రాజ్య చరిత్ర కెంత ఉపయుక్తమైందో మల్లంపల్లివారు వేమ రెడ్డి రాజ్య చరిత్రలో ప్రశంసించారు. "ఈ ఒక్క చాటు వాధారంగా అల్లాడవేమని విజయ పరంపర తెలిసింది. ఇదే దొరకనిచో అల్లాడవిభుని చరిత్ర తెలిసేదికా"దన్నారు. సి.పి. బ్రౌనుపై చాటువులు శాస్త్రిగారు శోధించి తొలిసారి వెలుగులోకి తెచ్చారు. శాస్త్రిగారి వాఙ్మయ సేవలో సేకరణ ఒక్కటి.

2. **చాటుపద్య మణిమంజరి - ద్వితీయ భాగము** (1922): దేవతా,కవి, రాజ ప్రశంసాస్తబకాలుగా ఇది కూర్చబడింది. రంగనాధుని శివకవిత దీనివల్ల బయటపడినవి 'దామెర వారి వంశావళి' చెన్నపురిపై తెలుగువారికి గల సంబంధం తెల్పిన ప్రామాణిక రచన. చరిత్ర శోధన కిది ఎంతగానో ఉపయోగపడింది. కాకతీయ సైన్యాధిపతుల బిరుద - జయ ప్రశస్తులు చరిత్ర శోధన కత్యంతమూ ఉయోగించినాయి. రాతిబండపై శా. శ. 1621 లో చెక్కబడిన పద్యం, బెణక కవి పద్యాలు శాస్త్రిగారి శోధనలోనివే. జనశ్రుతిలోని గాథలను గ్రంథస్థ మొన రించారు. జనులనోళ్ళలో నానుతున్న చాటువులు సేకరించి ప్రకటించటం ఒక గొప్ప సేవ. శాస్త్రిగారి గ్రంథం మరికొన్ని సంకలనాలకు ప్రేరకమైంది. పది మంది సంస్కృతకవుల చాటువు లిందున్నాయి. ఈ ప్రచురణవలన ఎంతో సాహిత్యం ఉత్సన్నం కాకుండా నిల్చింది. చరిత్ర పరిశోధకుల కిది ఒక ఆధార గ్రంథంగా ఏర్పడటం దీని విశిష్టత.

3. ప్రబంధ రత్నావళి (1918) : ప్రాచీన కవీశ్వరకృతాలై ఈ నాడు దొరకకున్న ప్రబంధాలనుండి ప్రాచీనులే సేకరించి ఉంచిన పద్య సంకలనం. ఒక కర్త పెదపాటి జగన్నాథకవి. 'ప్రబంధరత్నాకర'మను పేరిట ఐదాశ్వాసాలుగా కూర్చగా తొలి మూడాశ్వాసాలే శాస్త్రిగారికి లభించినాయి. రెండవ సంధాత పేరు తెలియదు.[1] ఈ ఇర్వురు కూర్చినవీ శాస్త్రిగారు. 'ప్రబంధరత్నావళి'గా సంకలించి శాస్త్రీయ దృక్పథంతో పరిష్కరించి ప్రకటించారు.

ఈ సంకలన ప్రచురణం వల్ల ఎంతోమంది విస్మృత కవులు వెలుగులోకి వచ్చారు. కవుల చరిత్ర పునర్నిర్మాణానికి అవకాశం ఏర్పడింది. ప్రాచీన జైన

1. ఆంధ్రసాహిత్య పరిషత్తు 'ఉదాహరణ పద్యము'లని పేర్కొన్నది.

కవి అథర్వణుని భారతం ఉన్నదని తెలిసింది. అన్నమయ్య శతక రచన చేసిన ట్లాధారం లభించినది. రావిపాటి త్రిపురాంతకుని అంబికా శతకంలోనుంచీ, చంద్ర తారావళినుంచీ పద్యాలు తెలిసికొనటం జరిగినది. నన్నెచోడుడు, తిక్కన, నందిమల్లయల రచనలు క్రొత్తవి కనుగొనటాని కిది ప్రేరక మయింది. సాహిత్య పరిశోధకులకీ సంకలనమే మూల కారణమైంది. పలు ప్రాచీన కృతుల శోధనకు, ప్రచురణకు ఈ ఆధార గ్రంథమే ప్రధాన మని గమనింపవలసి ఉంది.

4. గ్రంథ వివరణికలు (**Descriptive Catalogues**) : శ్రీ ప్రభాకర శాస్త్రిగారు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో ప్రవేశించటం తిమింగిలం సముద్రంలోకి ప్రవేశించటమే! ఆ సముద్రాన్ని శోధించి వెలుగు చూడని మణు లెన్నింటినో బయల్పరచారు. వారక్కడ పనిచేసిన ముప్పదియేళ్లల్లో గ్రంథ వివరణికలు 19 సంపుటాలుగా వెలువడినాయి. ఈ ప్రచురణలతో భాషా పరి శోధకులకు బంగారు గని దొరకినట్లయింది. మౌలిక ప్రతిభతో ఈ ఆధార గ్రంథ ప్రణాళికను రూపొందించటం జరిగింది. ఇందు ప్రతుల వివరణ, దొరకిన విధమూ, ఎప్పుడు సేకరించినదీ, కవిపేరూ, ఆశ్వాసాద్యంత గద్యలూ, దొరికితే లేఖకుని పేరూ, కవితాశైలి తెల్పే పద్యాలూ, వంశవృక్షాలూ-ఈ తీరుగా ఉన్నది. ఆంధ్రకవి చరిత్ర సౌధ ద్వారం తెరచినట్లయింది. కవుల కాల నిర్ణయానికి ఈ వివరా లెంతగానో తోడ్పడినాయి.

ఈ గ్రంథ పరంపరవల్ల ఆంధ్ర సాహిత్య పరిశోధన అనంతర కాలంలో ఎంతగానో సాగింది. భాషా పరిశోధకుల కిది ఉపాదేయ గ్రంథమై కూర్చున్నది.

ఈ తీరుననే క్రీ.శ. 4వ శతాబ్దినుండి క్రీ.శ. 12వ శతాబ్దివరకు ఉన్న శాసనాలను సంకలించి ఉంచారు. ఇది అముద్రితము.

ప్రాచీన గ్రంథ పరిష్కరణ మూలాన ఎన్నో క్రొత్త సంగతులు వారి శోధనలో లభించినాయి. గ్రంథ పరిష్కరణను శాస్త్రబద్ధంగా, సప్రమాణంగా సత్య నిష్ఠతో గావించుటే కాక, వారి అపూర్వ పరిశోధనలో లభించిన విషయా లన్నింటినీ పీఠికా రూపంలో ప్రకటించి భాష కెంతో మేలు కూర్చారు.

1. బసవ పురాణము (1927) : శివ కవి యుగ సారస్వతానికి ముఖ ద్వారం లాంటిది దీనికి రచించిన పీఠిక. పరిశోధనలో శాస్త్రిగారి మౌలిక ప్రజ్ఞ కిది అద్దం పట్టింది. ఇందులో ఆరాధ్యులు వీరశైవులు కారని నిరూపించారు. వీర శైవము పుట్టుక 12వ శతాబ్ది అని ప్రమాణాలతో నిరూపించారు. ఇది కొన్ని వివాదాలకూ దారి తీసిన మాట నిజం. వీరశైవ మూలగ్రంథాలు, బసవేశ్వరా నుయాయు లెరుగని వానిని తొలిసారిగా తమ పరిశోధనలో వెల్లడించి, వీరశైవ పండితులు విస్తుపోయేట్టు చేశారు. పాశుపత శైవంగూర్చి, విద్యారణ్యుల గ్రంథాల్లో ఏమని ఉన్నదో ఉట్టంకించారు. వీరశైవం బసవేశ్వరోపజ్ఞం అని శాస్త్రిగారు పరిశోధనలో ఆధారాలతో నిరూపించారు.

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో 'శివ కవులు' ఉన్నారని తొలుత తెలిపింది శ్రీ శాస్త్రిగారు. శివకవుల ప్రత్యేక లక్షణాలు, ప్రాస విశేషాలు, వైరిపద ప్రయోగాలు, ఛందస్స్వాతంత్ర్యమూ, శాంత ప్రాసమూ, ద్విపదలో ప్రాసయతీ, రేఫద్వయ సాంకర్యమూ, కేవల శివభక్తుల గూర్చియే రచనలు సాగించడం, వర్గ సమీప ప్రాస వంటి లక్షణాలు శోధించి తెల్పిన తొలి పరిశోధకుడు శాస్త్రిగారు. శిథిల ద్విత్వాన్ని గూర్చి తెలుగు వ్యాకరణాలు చెప్పక పోవడాన్ని గుర్తించారు. ఎన్నో అపూర్వ విషయాలు వారి మౌలిక పరిశోధనలో వెల్లడి అయినాయి.

2. సుగ్రీవ విజయము (1939) : దీనిని పరిష్కరించి 'మధుర కవితలు' అను పేరట పీఠికను సంతరించారు. యక్షగానోత్పత్తి, యక్షులకూ, జక్కులకూ గల సంబంధం నిరూపణ గావించారు. భాష, భావం, ఛందస్సు దేశిగా ఉండడం దీని లక్షణంగా గుర్తించారు 'కురవంజి - యక్షగాన' వాదానికి అంకురార్పణ గావించి, అనంతర పరిశోధకులకు త్రోవ చూపినారు. ఆ తరువాత పరిశోధకులలో ఆచార్య యస్వీ జోగారావుగారు ప్రథమతః చెప్పదగినవారు.

3. ఉద్భటారాధ్య చరిత్ర (1925) : పరిష్కరించి పీఠిక వెలయించారు. తెనాలి రామలింగకవి, తెనాలి రామకృష్ణకవి ఒక్కరే అని ఈ పీఠికలో నిర్ధారించారు. శ్రీ శాస్త్రిగారు శైవ వాఙ్మయ పరిశోధనకు కన్నడ కృతులను గూడా శోధించారు. ఉద్భటారాధ్య చరిత్ర రచన విషయంలో ఆంధ్ర, కన్నడ కవులు భేదించిన సంగతిని గుర్తించారు.

4. హరవిలాసము (1939) : దీని పీఠికలో తరుణాసీరి, తవాయి మొదలైన ప్రదేశాలను భౌగోళికంగా గుర్తించారు. ఇందు తవాయి మలయా ద్వీపకల్పంలోని రేవు పట్టణ మని తేల్చారు. 'తరుణాసీరి' మలయా ద్వీపకల్పం లోని ప్రధాన నగరమని తెలిపారు. ఇవి నూతన పరిశోధనలు.

తొలి ఉదాహరణ కావ్యం పాల్కురికి సోమనాథుని 'బసవోదాహరణము' వెలికి తీసి ప్రచురించిన వారు ప్రభాకరశాస్త్రిగారే! తొలి శాస్త్రీయ వైద్య గ్రంథం మంత్రి అప్పన విరచితమైన దానిని 1922 లో ప్రచురించినారు పీఠికలో వివరింపబడిన నాటి స్థితి గతులు సామాజిక శాస్త్ర పరిశోధకులకు ఎంతగానో ఉపయోగకర మైనాయి.

5. క్రీడాభిరామము (1928) : ఇది శ్రీనాథ రచితమే అనడాన్ని ఒకంత త్రోసివేయరాని ఉపపత్తులు పదుల కొద్దీ చూపి నిరూపించారు. గాథా సప్త శతిలోని రెండు గాథలు దీనిలో ఆంధ్రీకరింపబడడాన్ని తొలుత గుర్తించారు భవభూతి, మురారుల ప్రభావ మున్నదని శాస్త్రిగారు తెల్పటం, అనంతర పరిశోధ కులకు సూచికయైనది. ఏక శిలా నగర చరిత్ర కీ కృతి ఎట్లు దర్పణప్రాయ మైందో నిరూపించారు. శ్రీనాథునిచే ప్రభావితులైన కవులనుగూర్చి ప్రస్తావించారు. ఎన్నో పరిశోధిత విషయము లీ పీఠికలో నెలకొన్నవనటం గుర్తింపవలసి ఉంది.

6. పరిశోధనాత్మక వ్యాసాలు : వాఙ్మయ పరిణామం (1924) భాష మహాప్రస్థానాన్ని గూర్చి, ఆంధ్ర భాషావతారం (1929) శబ్ద పరిణామాన్ని గూర్చి తెల్పే వ్యాసాలూ. అరసున్న (1928) ప్రథమావిభక్తి'ండు' అనేవీ విశ్లేషణతో కూడిన పరిశోధనాత్మక వ్యాసాలు. 'నన్నయకు పూర్వపు ఛందస్సు' (1922) మరొక పరిశోధనాత్మక వ్యాసం. 'పండితారాధ్య చరిత్ర' అను వ్యాసంలో మల్లికార్జున పండితునిది 'వాణస' వంశమనీ, ఆ వంశంలో వాడే పద్మోత్తర ఖండ కృతి భర్త కందనామాత్యు డనీ కొత్త సంగతి శాస్త్రిగారి పరిశోధనలో తేలింది.

'రంగనాథుని శివ కవిత' శాస్త్రిగారి పరిశోధనలో వెలికి వచ్చింది. ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణంలోని పద్యాలు సంకీర్ణ తాళపత్ర సంపుటాల నుండి ఏరి, ముప్పయి పద్యాలు ప్రకటించారు. ఇది విచక్షణాత్మక విశ్లేషణ

శాసన పరిశీలన ఆధారంగా భాషా చరిత్ర నిరూపించే పద్ధతిని వేటూరి వారు మొదలు పెట్టారు.

# 10. చరిత్ర పరిశోధన

1. తంజావూరి ఆంధ్ర రాజుల చరిత్ర (1914) : దక్షిణదేశాంధ్ర చరిత్ర, సాహిత్యాలనుగూర్చి శాస్త్రీయపద్ధతిని శోధించి తొలుత ఎఱుకపరచిన వారు ప్రభాకరశాస్త్రిగారు. ఆ నాటి తంజాపురాంధ్ర, సంస్కృత పండితుల, కవుల చరిత్రలు, తంజాపురాంధ్రనాయక రాజుల సంగీత, సాహిత్య పోషణం, ఆ నాటి కవయిత్రులు, కనకాభిషేకాలు, యుద్ధ విజయాలు, రాజుల దిన చర్యలు, పండితులైన ప్రభువులు, ప్రభువులకు శిష్యులైన పండితులు, శ్రీ తంజావూరు సరస్వతీ మహల్ సంగతులు ఇట్లా ఎన్నో పరిశోధిత విషయాలు తెల్పినారు. శ్రీ వి.ఆర్. నార్ల శాస్త్రిగారి రచనా పాటవాన్నిట్లా శ్లాఘించారు ఒక లేఖలో (20-11-1984) : "He was, as I now see, a great master of Telugu Prose. I am particularly struck by the amazing felicity with which he moulded his style to suit the subject .... He, with his intimate knowledge of the life and literature of that last phase of our medieval age, could have given us an account of the wars of that period using the military nomenclature of that period."

2. శృంగార శ్రీనాథము (1923) : శృంగార శ్రీనాథ రచనంతో ప్రభాకర శాస్త్రులవారు రెడ్డి రాజ్య సంశోధనకు పునాది వేశారు 'మన భాషలో ఇదివర కెవరు గాని ఇట్టి గ్రంథం రచించి ఉండలే'దని ఆచార్య మామిడిపూడి వేంకట రంగయ్యగారు ప్రశంసించినారు. దక్షారామ, పరివెల, పిఠాపురం వర్ణనలు భీమ ఖండంలోనివి చారిత్రకంగా ఉండడాన్ని గుర్తించారు. పాండిత్య విషయంలో పోతరాజుగారి కంటె శ్రీనాథ భట్టారకుడు దండి వాడని నిరూపించారు. కవుల కాల నిర్ణయాలు ఎన్నో చేశారు. ఇందు కొన్ని వివాద గ్రస్తా

లైనవీ లేకపోలేదు. శ్రీనాథుడు శృంగారి అని నిరూపించే ఉపపత్తులు ఎన్నో చూపించారు. రెడ్ల కాలం నాటి శాసనాలు ఈ గ్రంథాని కనుబంధంగా చేర్చి చరిత్ర శోధకుల కెంతో ఉపకృతి యొనర్చారు. ఒక ప్రాచీన కవిపై ఇంత సమగ్ర గ్రంథం రచించటంలో శాస్త్రిగారే మొట్టమొదటివారు.

'శాతవాహనులు' అనే వ్యాసంలో సాతవాహను లాంధ్రు లని నిరూపించే ప్రమాణాలు చూపారు. 'ఇక్ష్వాకులు - పుట్టు పూర్వోత్తరాలు', నాగార్జుని కాలం, తంజావూరు రాజుల విగ్రహాలు, 'శ్రీకాకుళం' (నేటి కృష్ణాజిల్లా) రాజధానిగా లేదని నిరూపించేదీ, శివాజీ మహారాజు వంటి వ్యాసాలు చరిత్ర పరిశోధనకు సంబంధించినవి.

# 11. శాసన పరిష్కారాలు

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు శాసన పరిష్కారానికి పరిక్రమించడానికి వారి మౌలికమైన ప్రతిభ మూలకందం. శాసన పఠనాభిలాష, శాసన విషయ పరిశీలన లంటే శాస్త్రగారికి ప్రీతి. ప్రాచీన లిపులు నేర్చుకొన్నారు. అక్షర పరిణామాల్ని గుర్తించారు. శాస్త్రిగారి ఉపజ్ఞ మహత్తరమైంది. దాని కవధు ల్లేవు.

1. నాగబు : రెండువేలేండ్ల నాటి అమరావతీ శాసనంలోని పదం. తెలుగుకు ఆ నాటికే ఒక లిపీ, వ్యవహారమూ ఉన్నట్లు కనుగొన్నారు. తొలి తెలుగు పదం ఈ శాసనాల్లో గుర్తించిన యశస్సు శాస్త్రి గారికి దక్కింది.

2. లక్ష్మీపుర శాసనము (1924) : ఇందలి శాసన భాష ప్రాచీన తమమని గుర్తించటం జరిగింది. శబ్ద విచారంలో క్రమ పరిణామం దీనివల్ల తెలియవచ్చింది.

3. పల్లవ నరసింహవర్మ తామ్ర శాసనము : కాళహస్తి రాజా వారి నగరిలో శాస్త్రి గారి గ్రంథాన్వేషణలో బయల్పడిన శాసనం. శాసన కాలం క్రీ. శ. 701, 702. తెలుగు - కన్నడ లిపిలో ఈ శాసనం ఉన్నది. అప్పటి శాసనాల్లో ప్రభవాది సంవత్సరాల పేళ్ళు లేకుండుట గుర్తించినారు.

4. కపిలేశ్వరపుర శాసనము : ఇది చరిత్ర కంటె భాషా పరిశీలనకు ఉపకరించింది. ఇందలి 'వింత' అక్కరాన్ని తొలుత శాస్త్రిగారు గుర్తించి, పదాలకు అర్థ నిరూపణ గావించారు.

5. అహదనకర శాసనము : ఈ శాసనాన్ని తొలుత బర్గెస్ దొర పఠించాడు. ఫ్లీటు దొర దీన్ని తమిళ శాసనమని భ్రమించాడు. తెలుగు శాసనమని తొలుత కొమఱ్ఱాజువారు గుర్తించారు. ఇందు 'వింత' అక్కరము కలదనీ, దాని ప్రకారం శాసనాన్ని పఠింపవలెననీ శాస్త్రిగారి వాదం. దానికి ఎన్నో ఖండనలు

వచ్చినాయి. పదాల అర్థ నిర్ణయాలు పలు వాదాలకు దారి తీసినాయి. శాసన శోధనలో ఈ శాసన చర్చ పెను గాలివాన పుట్టించింది ఈ నాటికీ వాదనలు జరుగుతూనే ఉన్నాయి.

'చిల్లర శాసనము'లను పేరిట ఏకమూరు శాసనం, అనంతవర తామ్ర శాసనం, ముక్త్యాల శాసనములు ప్రకటించారు. శాస్త్రిగారు లిపి పరిణామం యొక్క అవగాహన మూలాన ఆంధ్ర లిపి సంస్కారానికి త్రోవలు చూపారు.

## ఆంధ్ర లిపి సంస్కరణ (1928) :

లిపి శాస్త్ర ప్రవీణులు కావడంచేత సంస్కరణకు మార్గ మీ వ్యాసంలో చూపించారు. ఇది అరవయ్యేళ్ళ క్రితం మాట. అక్షర సంఖ్య తగ్గడానికి మార్గాలు వెల్లడించారు. ఆంధ్ర లిపి సంస్కరణకు ఉద్యమించిన వారిలో శాస్త్రిగారు ప్రధానులు, ప్రాగ్రేసరులు కూడ!

శాస్త్రిగారి పరిశోధనలవల్ల గుప్తార్థా లెన్నో బహిర్గతాలైనాయి. కొత్త సంగతు లెన్నో శోధించి త్రవ్వి తలకెత్తిన ప్రతిభామహితులు ప్రభాకర శాస్త్రి గారు. అందుకే విశ్వనాథ సత్యనారాయణగారు తమ 'త్రిశూల' నాటక ప్రస్తావనలో ఇట్లా శ్లాఘించారు :

ఉ॥ "వేటురి వారి వ్యాఖ్యలును పీఠికలున్ దెలుగుం బొలంతికిన్
బేటులు రేగు గందవొడి వెట్టిన పూతలు "

# 12. సాహిత్య విమర్శ

వేటూరివారి సాహిత్య విమర్శ ప్రధానంగా పీఠికల్లో, వ్యాసాల్లో, వ్యాఖ్యానాల్లో, శబ్దవిచారంలో దర్శనమిస్తుంది. విమర్శముఖంగా ఎన్నో మఱుగు పడిన విషయాలను వెలికితీశారు.

1. మనుచరిత్ర పీఠిక (1926) : కేవల కాలచర్చలు కాక, పెద్దనకు పూర్వులు పోయిన త్రోవలూ, క్రొత్తల్లో మార్పులూ, అవి పెద్దనాదుల్లో ఎట్లు పెంపొందినవీ విమర్శించి చూపారు. కావ్యవిమర్శతోపాటు రసచర్చ, పదాల సాధుత్వ నిరూపణ కావించారు. సాహిత్య విమర్శను ప్రాచీనపంథనుండి క్రొత్త పుంతలు త్రొక్కించిన తొలితరంవారిలో శాస్త్రిగారు ప్రముఖులు.

2. బసవపురాణ పీఠికలో దేశిఛందము ద్విపదా, దాని తీరుతెన్నులూ, వర్గప్రాసాదులూ మొదలైన విషయా లెన్నో సప్రమాణంగా విమర్శించారు.

3. బాల భాష : దీనిని జాతి భద్రపరచుకొనవలసినదిగా గుర్తించారు. భూములకు వలె భాషకును 'సర్వే' జరగాలని ఉద్ఘాటించారు. విమర్శలో కూడా పలు పరిశోధనాంశాలు చోటుచేసికొన్నాయి.

4. ఉత్తరహరివంశ పీఠిక (1936) : కాలచర్చ, సోమనాథుని ఇతర కృతులూ, కవితా విమర్శా, అపూర్వ పదాల గుర్తింపూ, తులనాత్మక పరిశీలనా ఇందు చేయబడ్డాయి. అట్లాగే హరవిలాస పీఠికలో సమగ్ర కవితా విమర్శ చేయడమే కాదు. శ్రీనాథుని ఆంధ్రీకరణ పద్ధతినీ ఉగ్గడించారు.

'కృష్ణరాయల విద్యాగోష్ఠులు' (1924) అనే వ్యాసంలో బండారు లక్ష్మీనారాయణ రచించిన 'సంగీత సూర్యోదయ' పీఠిక చారిత్రక ప్రాధాన్యం కలదని వేటూరివారు నిరూపించారు. 'దక్షిణదేశ మందలి ఆంధ్ర వాఙ్మయము' మరెన్నో క్రొత్త సంగతులు వివరించింది. ప్రాచీనాంధ్ర వచన కావ్యాల స్వరూప స్వభావాలు

వివరిస్తూ ఒక వ్యాసం ప్రకటించారు. ఆంధ్ర కవిత-పురాణయుగము, ఆంధ్ర కవులు-ప్రబంధయుగము, భాషావికాసము, కవితాపారమ్యము (1943) మున్నగు వ్యాసాలు సాహిత్య విమర్శకు కేంద్ర స్థానాలుగా భాసిల్లాయి.

'గ్రంథగ్రంథు'లెన్నో విడదీశారు. శబ్దవిచారంలో ప్రభాకరశాస్త్రిగారు దిట్టలు. బసవపురాణ పీఠికలో 198 పదాలు, క్రీడాభిరామ పీఠికలో 65 పదాలు, వింత నిఘంటువు లను పేరిట 12, గ్రంథగ్రంథుల పేరిట 47, శాసనస్థ పదాలు 13, అసాధారణ ప్రయోగాలు 12, ప్రాత పలుకుబళ్ళు 20 వివరింపబడినాయి. ఇందలి పదాలన్నీ ఇప్పటికీ నిఘంటువుల్లో చేరకపోవటం విచారకరం. బహు సారస్వతాల పరిజ్ఞానమూ, ఉపజ్ఞా కారణాలుగా శబ్దవిచారాన్ని ప్రామాణికంగా ఒనర్చినవారు శాస్త్రిగారు. కొన్ని నిఘంటు ప్రమాణా లెంతటి అప్రౌఢకల్పితాలో నిరూపించటం జరిగింది. వీరి పీఠికలు సాహిత్య విమర్శకు పేటికలు. సారస్వతాభిరుచి, జిజ్ఞాస జనుల్లో పెంపొందించటానికి కీ విమర్శ వ్యాసాలెంతగానో దోహదపడ్డవి.

## సి. పి. బ్రౌనుదొర కృషి :

కల్నల్ మెకంజీ, (బ్రౌనుదొరలను గూర్చిన తొలి వ్యాసం 4-3-1911లో కృష్ణా పత్రికలో ప్రచురించారు. పిమ్మట సి పి. బ్రౌనుదొరగారనే వ్యాసాన్ని త్రిలింగలో (1923) ప్రకటించారు. మొట్టమొదటిసారిగా బ్రౌనుదొర సాహిత్య జీవితాన్ని (ఆంగ్ల పత్రిక) జె.ఏ. ఏట్సుదొర సాయంతో లండను నుంచి 1936 లో సేకరించి పెట్టుకొన్నారు. ఇంతవరకు ఇతరు లెవరికీ లభ్యం కాని విశిష్టప్రతి అది. తెలుగు ప్రజలకు బ్రౌనుదొర గురించి తొలుత ఎఱుకపరచిన కీర్తి శ్రీ ప్రభాకరశాస్త్రిగారిదే. బ్రౌను లేఖలు కొన్నింటిని (1923, 24) సరస్వతిలో ప్రచురింపజేసారు. ఇంత కృషి కళ్ళకు కట్టినట్టు కన్పిస్తుండగా శ్రీ బంగోరెగారు 'బ్రౌను లేఖలు' అనే గ్రంథంలో వెనకుట వారి ఎఱుక చాలమినీ, దుందుడుకుతనాన్నీ వెల్లడిచేస్తున్నదేగాని, సత్య నిష్ఠ మాత్రంకాదు.

## కథా రచనలు :

లభించిన కథలు నాలుగు : 1. కరుణకము, 2. కలికి చిలుక, 3. తత్రానందస్వామి, 4. పుణ్యవతి - భాగ్యవతి, 5. కామధేనువు కథను వ్యావహారిక

భాషలో (1914) రచించారు. 'మా తాతతాత' అనే కథ (మరాటి వెంకటభట్టు) వ్రాయాలని సంకల్పించినట్లు శాస్త్రిగారి 'డైరీ' చెప్పుతున్నది. చిన్న కథల కంతగా ప్రాచుర్యం లేని రోజుల్లో కథారచనవైపు వారి కలం మళ్ళింది. కథల రాశి తక్కువైనా వాసిలో మిన్న అనిపించుకొన్నాయి. కథన శిల్పమూ, భాషా, సంఘటనల కూర్పూ మెచ్చదగిన అంశాలు.

## వ్యావహారిక భాషా సమర్థన :

వేటూరి వారి మాటలివి : "రామమూర్తి పంతులుగారి వాదముతో నేను సంపూర్ణముగా ఏకీభవించినవాడను. 1912-13 ప్రాంతములో వాడుక భాషలో నేనే కొన్ని గ్రంథములు ప్రకటించినాను. వాడుక భాషలో వ్యాసాలు వ్రాయడం తప్పుగా భావించే కాలమది". గిడుగువారి 'తెలుగు' పత్రికలో (1919 సెప్టెంబరు) వచన రచనలో వ్యావహారికభాష అనే వ్యాసం వ్రాశారు. వేటూరివారు నవ్యులలో నవ్యులు. సామాజిక స్పృహను గుర్తించిన వారు. ఇటువంటి భాషనే వాడవలసిందని శాసించడం ఎవరికీ తరం కాదని ఉద్ఘాటించారు. 'నేటి తెనుగు - నోటి తెనుగు' అనే వ్యాసం 1945 లో సర్వధారి - ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలో ప్రకటించారు. ప్రతిమానువాదంలో వ్యావహారిక భాషా ప్రయోగం చేసి చూపించారు. అప్పటి ప్రాచీన తరహా పండితుల్లో, ఆదిలోనే వ్యావహారిక భాష కొక భుజం ఒడ్డి, చిత్తశుద్ధితో వ్యవహరించింది శాస్త్రిగారొక్కరే అనటం అతిశయోక్తి కాదు.

జానపద సాహిత్య సముద్ధరణ : సాహిత్య సంపద అందరకూ అనుభవింపదగినట్లుగా ఉండాలని జాతిని మేల్కొల్పిన కొద్ది మందిలో శ్రీ శాస్త్రిగారొక్కరు. జానపదుల నాలుకలపై తేలికగా తేలియాడే దేశి సారస్వత మంతా అనుభవయోగ్యమే అని శాస్త్రిగారి తలంపు. కాటమరాజు కథ ప్రకటించడం ఆయన అభ్యుదయ దృష్టికి సాక్షి!

పసిపిల్లల అన్ని దశలకు సంబంధించిన పాటలు సేకరించి 'బాల భాష' అనే పేరుతో ప్రకటించారు. అట్లే స్త్రీలు పాడుకొనే పాటలు సేకరించి, మధుర రచనలు అనే పేర ఎన్నింటినో కృష్ణా పత్రికలో 1917 లోనే ప్రచురించారు. పండితులచేత అనాదృతమైన వాఙ్మయ సమగ్ర స్వరూపాన్ని ఆకళించుకొన్న వారిలో

వేటూరి వారు ప్రముఖులు. జాజఅ, సువ్వి, ఏల, తుమ్మెద పాటల వంటివి వెదకి వెలికి తీసినారు (1944). కూనలమ్మ పదాల నెన్నింటిని భారతిలో (1930) ప్రకటించారు. ఆకాశవాణిలో ఈ విషయంపై ప్రసంగించారు (1941, 45, 47).

'గాలి కబుర్లు' అనుపేర సేకరించిన నానుడులు, పలుకుబడులు, సామెతలు అమరములాగున వర్గాలుగా వింగడించి ఉంచుకొన్నారు వ్యవహారభాష పురోగతికి వీని ప్రకటన ఎంతైనా అవసరం. జానపద వాఙ్మయ కవాటాలను తెరిచి, భావి పరిశోధనకు బాటను తీసిన ఉదార చరితులు ప్రభాకరశాస్త్రిగారు

## నీతి నిధి :

'ది ఎకానమీ ఆఫ్ హ్యూమన్ లైఫ్' అనే గ్రంథానికి తెనుగుసేత. మూల గ్రంథకర్త ఎవరో తెలియదు అప్పటిలో ఆంగ్ల ప్రతులు రెండే రెండు ఉండేవి. అంత అరుదైన గ్రంథ మది. శీల సంపత్తికి దోహదం చేసే రచన. సాధారణంగా అనువాదం మూల విధేయంగా ఉంటే సుందరంగా ఉండదు. సుందరంగా ఉంటే మూల విధేయంగానూ ఉండదు. ఈ రెండు గుణాలు ఒకే చోట జతపడిన చోటు ఈ కృతి. వాక్యాల సంక్షిప్తత, భావానుగుణమైన శైలి వీరి గద్యకు ప్రాణధాతువు. ప్రసన్న మధురంగా వచన రచన చేయటం శాస్త్రిగారికి అరచేతి ఉసిరిక. కేవల దేశభాషా పండితులు ఇంతటి ప్రశస్తానువాదం వెలయించటం ఎవరికైనా ఆశ్చర్యం గొల్పేదే. ఆంగ్లానికి తెనుగులో టీక ఒకరిచేత చేయించుకొన్నారు.

## స్థానిక చరిత్రలు (Local Records) :

కుంఫిణీ ప్రభుత్వంలో కల్నల్ కాలిన్ మెకంజీ దొర కొందరు లేఖకుల్ని నియమించి, వ్రాయించిన చరిత్రలు 400 సంపుటాలైనాయి. వాటినే సి. పి. బ్రౌను దొర 60 సంపుటాలుగా తిరగరాయించినాడు. వాటికే 'స్థానిక చరిత్ర' లన్న పేరు. ఇవి పరిశోధకులకు గనుల లాంటివి. వాటినుండి శాసనాలు, భాషా చారిత్రక సంప్రదాయ ప్రాధాన్యం కలవాని నేర్చి శాస్త్రిగారు పత్రికల్లో ప్రకటించి పరిశోధకులకు క్రొత్త త్రోవలు చూపారు. పరిశోధనా ప్రవణత వారి చేత ఈ పని చేయించింది. అమూల్య విషయాలెన్నో లోకం వీటి ప్రకటనవల్ల గ్రహింపగలిగింది.

# 13. సంస్కృత సాహిత్య సేవ

భాషలలో రమ్య గైర్వాణి. ఉభయ భాషా సాగరాల లోతులూ కనుగొన్న ప్రభాకరశాస్త్రిగారు సంస్కృత సరస్వతిని కొంతకు కొంత సేవించారు. నిజానికి శ్రీ శాస్త్రిగారు తమ పదునాల్గో యేట కవితా రచనకు శ్రీకారం చుట్టింది సంస్కృతంలోనే (1902). శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తమ పరమ గురువులు మాస్టరు సి. వి. వి. కృపకు పాత్రులైన రోజున వారిని సంస్కృత శ్లోకాలతో పూజించారు (1916). ఆ పిమ్మట 1925 లో గాంధీగారికి స్వాగత మొసంగుతూ కొన్నింటిని రచించి పఠించారు. అందలి దొక్క శ్లోకము వాచవికి-

శ్లో. కాయేన వాచా మనసేంద్రియై ర్వా
బుద్ధ్యాత్మనాచైక విశుద్ధ వృత్తయే।
సుదర్శనా ఆత్మవిదే మహాత్మనే
సుస్వాగతం మోహనచంద్ర గంధయే॥

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చాటు పద్య మణిమంజరి ద్వితీయ భాగంలో (1922) కవి ప్రశంసా స్తబక ప్రకరణంలో జనుల నోళ్ళలోమాత్రమే ఉండినవీ, తాటాకులలో చెదురు మదురుగా నున్నవీ, పది మంది సంస్కృత కవుల చాటువులు సేకరించి, సందర్భాలతో సహా వివరించి ప్రకటించారు. అందు బిల్హణుడు, పెద్దిభట్టు, జగన్నాథ పండితరాయలు, సుసర్ల బ్రహ్మనశాస్త్రి, కపర్దిస్వామి మొదలగు వారివి ఉన్నాయి. మణి ప్రవాళ భాషలో రచింపబడిన శ్లోకాలు ప్రకటించారు.

'నీతి ద్విషష్టిక' క్రీ శ. 6 వ శతాబ్దానికి పూర్వుడైన సుందర పాండ్యుని రచన. చెన్నపురి, తిరువనంతపురం గ్రంథాలయ తాళపత్ర ప్రతు లాధారంగా శ్రీ పురాణం సూర్యనారాయణశాస్త్రిగారూ, వీరూ సంయుక్తంగా పరిష్కరించారు. దీనికి విలువైన పీఠికను వేటూరివారు సంస్కృతంలో (1928) సంతరించారు.

'వింత నిఘంటువులు' అను పేరుతో ప్రసిద్ధ నిఘంటువుల్లో లేనివీ, వృద్ధాను శ్రుతిలో వినవచ్చునవీ వెదకిపట్టి (1923-24) అర్థ నిరూపణ గావించిన శబ్ద వేత్త శ్రీ ప్రభాకరశాస్త్రిగారు.

ఆంధ్ర దేశీయ సంస్కృత కవుల చరిత్ర వ్రాయాలని సంకల్పించి తొలి విడతగా సరస్వతి (ముక్త్యాల) పత్రికలో పది మంది కవుల జీవిత చరిత్రలు వారల వివరాలతో వెలువరించారు. 1. జాయ (ప) సేనాని, 2. చెన్నుభట్టు, 3. విశ్వేశ్వర కవిచంద్రుడు, 4 ప్రతాపరుద్ర దేవుడు, 5. విద్యానాథుడు (అగస్త్యుడు), 6. విశ్వనాథకవి, 7. నరసింహకవి, 8. శాకల్యమల్లుభట్టు, 9. పశుపతి నాగనాథుడు, 10. గౌరన. ఇందులో సంపూర్ణ 'సంస్కృత కవి జీవితములు' అని ప్రసిద్ధిపడసిన గ్రంథాలలో (ఔత్తరాహులవి, దాక్షిణాత్యు లవి) నలుగు రైదుగురి చరిత్రలు ఇంకా ఎక్కకపోవటం ఆశ్చర్యంగానే కనిపిస్తుంది.

తంజాపురాంధ్రరాజుల చరిత్ర (1914) లో ఆ యా ప్రభువుల కాలాల్లో ఉన్న సంస్కృతకవుల, పండితుల చరిత్రలు తొలిసారిగా ప్రభాకరులే వెలుగు లోకి కొనివచ్చారు. ఇందు రఘునాథ నాయకుడు, రాజ చూడామణి దీక్షితులు, మధురవాణి మొదలైనవారి సంస్కృత రచనలను గూర్చి లోకానికి ఎఱుక పఱచటం జరిగింది.

'నీతినిధి' అనే తెలుగుగ్రంథాన్ని సంస్కృతీకరింపవలెనని కూడా తల పోశారు. అది సంకల్పంలోనే ఉండిపోయింది. శాసనగతాలైన శ్లోకా లెన్నింటినో ఉద్ధరించారు. భాస, శ్రీహర్షాదుల కృతుల తెనిగించి, ఆ యా గీర్వాణ కవుల కవితా మధుధారలను చూఱలిచ్చారు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సంస్కృత సరస్వతీ సౌభాగ్య మందిరానికి అలంకారాలు దిద్దిన వాఙ్మయ శిల్పుల్లో పేర్కొదగ్గ ప్రముఖులు శ్రీ శాస్త్రిగారు సేకరించిన లొల్ల లక్ష్మీధరుడు శ్రీకృష్ణరాయలపై చెప్పిన చాటువూ, సమస్యా పూరణమూ చిత్తగించండి.

శ్లో॥ శ్రీకృష్ణక్షితిపాల దత్త మణిభి ర్విద్వత్కవీనాం గృహా
నానా రత్న విచిత్ర కుట్టిమ భువో రత్నాకరత్వం గతాః।
అబ్ధిః కేవల వారిపూర నిలయ స్సంభావ్యతే సజ్జనై
రంభోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాన్నిధి ర్వారిధిః ॥

**సాహిత్యేతర వ్యాసాలు :** సాహిత్యేతర విషయాలను గూర్చి సాకల్యంగా కొన్ని వ్యాసాలు ప్రచురించినారు.

1. 'వృక్షాయుర్వేదము' (1922) వ్రాత ప్రతిని గూర్చి స్థూలంగా విషయం వ్రాయగా, పిమ్మట ఆచంట లక్ష్మీపతిగారు దానిని ప్రచురించినారు.

2. సుభోజనము (1925 ఫిబ్రవరి) గూర్చి సరస్వతి పత్రికలో.

3. పాటలీ పుష్పము (1928 మే, భారతి) గురించి వివరాలు తెల్పడమే కాక, వైద్యగుణాలు కూడా తెల్పారు.

4. భుక్తిపత్రి (17-2-46 ఆంధ్రపత్రిక) ని తిరుపతి కొండనుండి తెప్పించి, రూపం, రంగూ రుచీ వారే శోధించి చూచి, ఆ వివరాలు తెల్పుతూ దానికీ పేరుపెట్టారు. పీనాదులు, ప్రాచీన వస్తు పరిశ్రమ, అభినయ కళ, నాటక కళ, తాటిచెట్టులను గురించి ఎన్నో విషయాలు తెల్పుతూ రచనలు చేశారు. 'అచ్చపు బుద్ధికి లేవగమ్యముల్' అనిపిస్తుంది శాస్త్రిగారిని చూస్తే!

# 14. తిరుపతిలో శాస్త్రిగారు (1940-50)

మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో పండిత పదవి నుంచి 1939 డిసెంబరులో రిటైర్ అయి, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూటు తెలుగు శాఖాధిపతిగా నియమితులైనారు. 1940 జూలైలో శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ కాలేజీలో తెలుగు విద్వాన్ తరగతు లారంభమైనాయి. అది కారణంగా కళాశాలలో ఆంధ్ర శాఖాధిపతిగా కూడ పని చేయ నారంభించారు. వారు ఆ నాటికే మదరాసు, అణ్ణామలై విశ్వవిద్యాలయాల 'స్టడీస్ బోర్డు'ల్లో సభ్యులుగా, పరీక్షా పత్ర నిర్ణాయకులుగా ఉంటూ వచ్చారు. శ్రీ వేంకటేశ్వర రీసెర్చి ఇన్‌స్టిట్యూటు జర్నల్‌లో వ్యాసాలు ప్రకటిస్తూ ఉండేవారు. 21-3-1945 నుండి పూర్తి కాలం పరిశోధన నిమిత్తంగా శాస్త్రిగారిని 'రీడరు' పదవి యందు తి.తి. దేవస్థానం నియమించింది. 1950 ఆగస్టులో వారు దివంగతు లయ్యే పర్యంతమూ వారా పదవిని నిర్వహించారు. 'రీడరు' పదవి చేపట్టిన తర్వాత శాస్త్రిగారికి సహాయకులుగా వారి శిష్యులు శ్రీమాన్ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగా రుండేవారు. ఈయన శాస్త్రిగారికి ప్రియాంతేవాసులు. యోగ సాధన యందునూ వారి కనుచరులే!

## దేశికోత్తముడు :

ప్రభాకర శాస్త్రిగారు తిరుపతిలో కళాశాలకు వెళ్ళే దృశ్యం ఎంతో ముచ్చట గొల్పేది. వారి శిష్యు లొక్కొక్క రొక పరిచర్య చేస్తూ వారిని వెంబడించేవారు. ఉదయగిరి శ్రీనివాసాచార్యులు (సీసా అనేవారు శాస్త్రిగారు) గారు మంచినీళ్ళ చెంబు తన సైకిలుకు తగిలించుకొని వెంబడించే వారు. తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారు శాస్త్రిగారి సాహిత్య కార్యక్రమాలకు సంబంధించిన కాగితాలు; సింగరాజు సచ్చిదానందంగారు తాటాకు పుస్తకాలు; రేడియో వ్యాసాలు, అచ్చు పుస్తకాలు తీసికొని పోచిరాజు శేషగిరి రావుగారు; పెన్సిళ్ళు, కలాలు తీసికొని రాణి సూర్యనారాయణగారు బయలుదేరి కాలేజీకి వెడుతూంటే ఏదో ఒక యోగాభ్యాసాన్ని గురించో, ప్రాచీన కవుల

చమత్కారాల గురించో వివరించి చెపుతూ నడక సాగించేవారు. ఒక్కొక్క తూరి ఎవరేనా విద్వాంసులు వస్తే, వారూ శాస్త్రిగారితో కాలేజీకి వచ్చేవారు. త్రోవలో అన్ని శాఖల పండితులూ కలిసినప్పుడు ఎంతో గౌరవంతో వారికి నమస్కరించేవారు. అందరు పండితులూ, విద్యార్థులూ ఒకే తత్పరతలో శ్రద్ధా భక్తులలో శాస్త్రిగారిని గౌరవించేవారు. ప్రభాకరశాస్త్రిగా రొక్కరికే అట్టి సమున్నత స్థితి ఉండేది. అప్పుడు దేవస్థానం పేష్కారుగా ఉన్న శ్రీ చెలికాని అన్నారావుగారు కాలేజీకి గాని, పరిశోధన సంస్థకు గాని వస్తే శాస్త్రిగారికి నమస్కరించి వారి సన్నిధిని కొంతసేపు కూర్చుండి, వారి ఆశీస్సులు పొందిన తర్వాతే టిక్కెన పరిపాలనకు సంబంధించిన విషయాలు చూచుకొనేవారు. ఏ పింగళి లక్ష్మీకాంతంగారో, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారో, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారో కళాశాలకు వస్తే శాస్త్రిగారి యెడ ఎంతో గౌరవ ప్రపత్తులతో ఉండేవారు. అటువంటి పెద్దలు కళాశాలకు వస్తే మా 'విద్వాన్' విద్యార్థులకు 'శిష్టానధ్యయనం'.

మనోమందిర కవాటాలను తెరిపించేదే నిజమైన చదువు. ఏ దేశికునికడ చదివిన చదువు మనస్సుకు రెక్కలు తొడుగుతూ, హృదయాల్లో పాల ధారలు నింపుతూ, రక్తనాళాలను చైతన్యంతో ఉచ్చలితం చేస్తూ విద్యుచ్చకితం చేసే త్రోవలను వేయగలదో అట్టి చదువు చెప్పినవారు ప్రభాకరశాస్త్రి మహో దయులు. వారు సాహిత్య శిష్యులకు ప్రాచీన కవుల కవితా నిర్మాణ మర్మాలను, తెలుగు మఱుగులనూ వివరించి చెపుతూంటే అదొక తన్మయత. ఏదో లోకాలకు తీసుకొనిపోయేవారు పాఠప్రవచనంలో. అదొక రస వ్యాఖ్యానంలా ఉండేది. ఏదేని పద్యానికి వివరణ ఈయదలుచుకొంటే, అట్టి పోలిక చాలికలు గల పద్యాలు వారి నోటినుండి తోరణాలుగా దొర్లేవి. 'ప్రెస్సు' కెక్కని పద్యా లెన్నో చెప్పే వారు. క్షణం ఏమారితే ఏ చరణం జారిపోతుందో అని ఎంతో జాగరూకతతో ఆ పద్యాలను 'నోట్సు'లో బిగించేవాళ్ళం. కొన్ని పద్యా లలాంటివి ఇంకా అచ్చు పడనేలేదు. కావ్యాలంకారాది శాస్త్ర విషయాలను వారు మక్కికి మక్కిగా అనువ దించటం కాక, మౌలికంగా ఉండి, మాలో ఆలోచనలు ప్రేరేపించేదిగా ఉండేది. వారి భాషా పరిశీలన తీరు సర్వతంత్ర స్వతంత్రం. భాషాశాస్త్రానికి సంబంధించి చెప్పవలసివస్తే వారొక 'అథారిటీ'. దాక్షిణాత్యభాష లన్నీ వారికి కరతలామల కాలు. సంస్కృత, ప్రాకృతాలు సరేసరి. తెలుగు నుడికారాలు, పలుకుబళ్ళు,

సామెతలు, నానుడులు వానివాని తీరుతెన్నులు, దేశిసాహితి సొంపు పెంపులు, వ్యావహారికభాషలో చమత్కారాలు ఇల్లెన్నో చెప్పి చవు లూరించేవారు. మధ్య మధ్య ఆశుకవితలు. ఒకసారి ప్రిన్సిపాలు శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామి, ఎం.ఏ.గారి ప్రస్తావన రాగా 'మిన్ను విరిగి మేనిమీద వ్రాలిన తొ్రట్రు, పాలుగారు ప్రిన్సిపాలుగారు' అని ఆశువు అల్లారు.

ఎప్పుడే విశేషం వారి నోటినుండి వస్తుందో అని అనుక్షణం ఎదురు చూచేవాళ్ళం. లేఖనం బాగులేని వారిని మందలించేవారు. శాస్త్రిగారు సహజంగా కరుణా స్వభావులు. శిష్యుల అభ్యుదయాన్ని సంతతం కాంక్షించడమే కాదు, త్రోవలు చూపేవారు. ప్రభాకరశాస్త్రిగారు వరుసగా ఆరేండ్లు తెలుగునకు ప్రధానాచార్యులుగా ఉన్నారు. అప్పటి శిష్యులలోనివారే 1. తిమ్మావజ్ఝల కోదండ రామయ్య (మధుర విశ్వవిద్యాలయం ప్రొఫెసరు), 2. శ్రీ ఏ. వి. శ్రీనివాసాచార్యులు - రిసెర్చి ఇన్‌స్టిట్యూటు పండితులు. 3 యస్. ఏ. నారాయణరావు (లేపాక్షిసంస్కృత కళాశాల ప్రిన్సిపాలు), 4. కప్పగంతుల శంకరప్రసాద్(నిడుబ్రోలు పి బి. ఎన్. కళాశాల లెక్చరరు), 5. పోచిరాజు శేషగిరిరావు (పెద్దాపురం మహారాణీ కళాశాల ఆంధ్ర శాఖాధిపతి), 6 రాణి సూర్యనారాయణ (తెలుగు పండితులు, నరేంద్రపురం, తూర్పు గోదావరి జిల్లా), 7. సింగరాజు సచ్చిదానందం (యస్. వి. కళాశాల, లెక్చరర్, తిరుపతి, ఆంధ్రప్రదేశ్ నాటక ఎకాడమీ కార్యవర్గ సభ్యులు కూడా)- ఇంకా ఎందరో! ప్రధానంగా రాయలసీమ ప్రాంతంలో అధ్యాపకులుగా ఉన్నవారు హెచ్చు!

జాతి, మత, కుల విభేదాలు శాస్త్రిగా రెరుగరు. షేక్‌మస్తాన్ అనే విద్యార్థి వారింటనుండి చదివినవాడు కర్నూలు ఉస్మానియా కళాశాలలో ఆంధ్ర శాఖాధిపతిగా వర్తించి, ఇటీవల విశ్రాంతి తీసికొన్నాడు. దాసి బసవయ్య అనే హరిజన విద్యార్థి శాస్త్రిగారి చలువవల్లనే విద్వాన్ చదివి, పండితుడైనాడు.

అందరినీ పుత్ర నిర్విశేషంగా ప్రేమించి, వాత్సల్యాన్ని చూపిన దేశికోత్తముడు ప్రభాకర శాస్త్రిగారు. అనుదినమూ వారిని స్మరించుకొనే శిష్యులు, యోగ శిష్యులు ఈ నాటికీ పందలకొలదీ ఉన్నారంటే ఆశ్చర్యం వేస్తుంది. ఉపాధ్యాయ శరీరానికి ఆయన కుండలినీ శక్తి. 'పండితా స్సమదర్శినః' అన్న

దానికి సజీవోదాహరణం శాస్త్రిగారు. శాస్త్రిగారి సతీమణి మహాలక్ష్మమ్మ గారు తమ సంతానంతో పాటు మమ్మల్నీ అపార వాత్సల్యంతో సాకిన పుణ్యసాధ్వి. అనుదినం శిష్యుల కష్ట సుఖాలను తెలుసుకొంటూ, అవసర సమయాల్లో ఆదుకొంటూండేది ఆ తల్లి.

## ఆర్తసేవ :

శాస్త్రిగారు స్వభావంచేత కరుణామయులు. ఆయన చేసిన యోగ సాధనకు విశ్వప్రేమ ఆధార పీఠం. కాగా కరుణ, అనుతాపము, సానుభూతి ముప్పేటగా వారిలో పనిచేశాయి. మాష్టరు సి. వి. వి. గారి అనుగ్రహ విశేషం చేత కొన్ని అపూర్వ శక్తులు శాస్త్రిగారి కబ్బినాయి. ఈ యోగసాధనలో గొప్ప సిద్ధి పొందిన మహనీయులు శ్రీ శాస్త్రిగారు. మానసిక, దైహిక రోగాలతో ఎంతో కొట్టుమిట్టాడుతున్న దీనులకూ - దుఃఖితులకూ - వారు సమాశ్వాసం కలిగించిన కథలూ, గాథలూ విశ్వాసులను పులకింప జేస్తాయి.

ధనికుడు, దరిద్రుడు, బాలుడు, వృద్ధుడు, ఉద్యోగి, కూలీ, పండితుడు, పామరుడు అనే భేదం గణింపక, ఆర్తులై తమ్మాశ్రయించిన వారికెల్లా నిరపేక్షంగా చికిత్స చేసేవారు. ఒక్క పండుకూడ వచ్చిన వారినుండి స్వీకరించి యెరుగరు. ఈ కఠోర నియమం అసిధారా వ్రతంగా చివరి వరకూ నెరపుతూనే ఉన్నారు. చికిత్సకై వచ్చేవారిలో డాక్టర్లు, లాయర్లు, ప్రొఫెసర్లు, కమ్యూనిష్టులు, కాంగ్రెసు వారు, రిక్షాలాగే కూలీలు-ఇట్లు పలు తెఱగుల వారుండేవారు. శ్రీ శాస్త్రిగారివల్ల ఆరోగ్య లాభం పొందిన వారందరితోనూ తాము నిమిత్తమాత్రులమనీ, శ్రీ మాష్టరుగారి దివ్యానుగ్రహమే సర్వ నిర్వాహకమనీ చెప్పటం మేమెరుగుదుము. 'వ్యాధిగ్రస్త నరాణాం చ దృఢగాత్రం స్వచేతసా' అని పరమ గురువులు మాష్టరు సి.వి.వి. గూర్చి చెప్పినది అక్షరశః శాస్త్రిగారి కన్వయిస్తుంది.

ఆయన యోగ వికాసాన్ని గూర్చి తరువాతి ప్రకరణంలో వివరింపబడు తుంది.

# 15. సారస్వత సేవ (1940-50)

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తి. తి. దేవస్థానం కొలువులో చేరిన తర్వాత పదేళ్ళల్లో గావించిన సేవ విశిష్టమైనదీ, ప్రజ్ఞాసుందరమైనదీ, ప్రతిభా సమంచితమైనదీను!

తిరుపతికి వచ్చిన పిమ్మట ప్రాచీనకృతులు పదింటిని పరిష్కరించి ప్రకటింపజేశారు : 1. రంగనాథ రామాయణము (1942), 2. వేంకటేశ్వర వచనములు (1945), 3. అన్నమాచార్య సంకీర్తనలు, 4, 5 సంపుటాలు (1949), 4. అన్నమాచార్య చరిత్ర (1949), 5. ధనుర్విద్యావిలాసము 6. శృంగారామరుకము (1949), 7. ఆంధ్ర కామందకము (1950), 8. కాటమరాజు కథ (1950), 9. సుభద్రాకళ్యాణము(1950), 10. పావులూరి మల్లన - సారసంగ్రహ గణితము (1950).

1. రంగనాథ రామాయణము : ఇది ప్రజారంజకమైన ద్విపద కావ్యం. అంతకుముందే ఎన్నో ముద్రణలు పొందినా, ప్రామాణిక ప్రతి కావలెనని ఆంధ్ర విశ్వకళా పరిషత్తు (విశాఖ) వారు శ్రీ ప్రభాకరశాస్త్రిగారిచే పరిష్కరింపజేసి ప్రచురించారు (1942). దేశిరచనయైన విలక్షణ ద్విపద కృతి. ఇందు ప్రాచీన భాషా సంప్రదాయాలు, పలుకుబడులు ఎన్నింటినో శాస్త్రిగారు గుర్తించారు.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారి కంటె ముందు పురాణం హయగ్రీవశాస్త్రి, వేదము వేంకటాచలశాస్త్రి, కరాలపాటి రంగయ్య, నేలటూరి వేంకటసుబ్బాశాస్త్రి, పనప్పాకం ఆనందాచార్యులు, తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్య ప్రభృతుల పరిష్కారము లున్నాయి. అయితే శాసనలిపి, తాళపత్రలిపి అంత సులభంగా పోల్చుకోదగినవికావు. పరిష్కర్తలు తమ కాలాని కనుగుణంగా ఉన్న వ్యవహారం ఆధారంగా, పాఠాలు నిర్ధరిస్తూ,పాఠాంతరాలు కల్పిస్తూ తమ వాదాలను సమర్థించుకో

జూచేవారు. మరికొందరు తాము గ్రామ్య మని భావించినవాటిని ప్రాచీన కవులు భావించి ఉండరనే నమ్మకంతో, పెడదారి త్రొక్కేవారు. బాలకి, సఖుడు వంటి ప్రయోగాలు తప్పని భావించి దిద్దడానికి పూనుకొన్నవా రున్నారు.

"అయితే కవి హృదయాన్ని గుర్తెరిగి, సాధు పాఠాలను లెస్సగా నిర్ణయించినవారిలో ప్రభాకరశాస్త్రిగారు ప్రథమ గణ్యులు. వివిధ ప్రతులను తైపారు చేసి, పాఠాలు చేర్చే పద్ధతికి వారు మూలపురుషులు.1"

వాస్తవానికి ప్రాచీన గ్రంథ సంస్కరణం ఒక కళ. దాన్ని పూర్తిగా ఆకళింపు చేసుకొన్న మహానుభావులు ప్రభాకరశాస్త్రిగారు. ఆయన పరిష్కరణలో కొన్ని నియమాలు పాటించారు: 1. మూల గ్రంథాన్ని నిర్ధారణ చేయటం, 2. ప్రక్షిప్తభాగాలను అనుబంధాలలో ఇవ్వటం, 3. భిన్నప్రతులతో సంప్రదించటం, 4. ప్రక్షిప్తాలను వేరుగా చూపటంవలన భావి పరిశీలకులకు అనుశీలనానికి అవకాశం ఒసగటం, 5. ప్రతిపుట అడుగునా పాఠభేదాలతో మూలాను సరణా లొసంగటం, 6. శబ్ద విశేషాలూ, సంప్రదాయాలూ తెలపటం. ఇటువంటి శాస్త్రీయ సంస్కరణ పద్ధతికి ప్రభాకరశాస్త్రిగారు ఒరవడి పెట్టినారు.

దీని కర్తృత్వ విషయం వివాదగ్రస్తం. శ్రీ శాస్త్రిగారి మతంలో గ్రంథ కర్త చక్రపాణి రంగనాథుడు. ఈ కవిని గురించి తొలుత లోకానికి ఎరుకపరచింది కూడా శాస్త్రిగారే తమ వాదాని కాధారంగా పదికారణాలను-బలవత్తరమైన వాటిని- శాస్త్రిగారు ప్రతిపాదించారు. డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు రంగనాథ రామాయణము గోనబుద్ధారెడ్డి కృతమని వాదించి, పరిష్కరించిన పుస్తకాన్ని ఆ పేరుతోనే ప్రకటింపజేశారు. వేమూరి విశ్వనాథశర్మగారు, జయంతి రామయ్య పంతులుగారు రెడ్డిగారికంటె పూర్వమే ఈ వాదాన్ని లేవనెత్తారు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు రెడ్డిగారి వాదాన్ని పరిపోషించారు. ఉభయ వాదాలను అవలోకించిన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఇట్లా వ్రాశారు2: "మన ఆంధ్ర సాహిత్య చరిత్రాన్నీ, అనూచానంగావచ్చే సంప్రదాయాన్నీ, దొరికిన చరిత్ర సాధనాలనూ

1. పరిశోధన 1 వ సం. 3 వ సంచికలో తిరుమల రామచంద్ర
2. సంస్కృతి - 2 సంపు. 8 సంచిక (1954 సెప్టెంబరు)

పట్టి నిష్పక్షపాతంగా చూస్తే రంగనాథు డనే కవి తన ప్రభువైన బుద్ధారెడ్డి పేరుతో దీన్ని రచించా డనుకోవడమే న్యాయమని తేలుతుంది..................రంగనాథు డనే వాడే ప్రపంచంలో ఉండలేదని, కృత్రిమంగా కల్పించిన వ్యక్తి అనీ చెప్పేవరకూ ఈ అభిమానం ఈ వాదములో (రెడ్డిగారి వాదం) ప్రబలింది .. రంగనాథుడు కృత్రిమ పురుష డని రెడ్డిగారి వలె దృఢముగా చాటుట నా చేతఁగాని పని."

ఇక ఒకటవ అనుబంధంలో శాస్త్రిగారు 'సులోచనా వృత్తాంతము'ను ప్రకటించారు. ఇది కూడా రెడ్డిగారికి నచ్చలేదు. పలు విధాల అపకృష్టముగానూ, భిన్నముగానూ కానవచ్చే గ్రంథము మూల గ్రంథంలో చేర్చకపోవుటయే సముచిత మనిపిస్తుంది. శాస్త్రిగారి పరిశోధన నిర్మమతతో కూడింది. వారు ప్రక్షిప్త భాగాలని పేర్కొన్నవి కట్టా వరదరాజు రామాయణంలో కానవచ్చినవి. మరికొన్ని అన్నమాచార్య కృత రామాయణ ద్విపదలు కాదగు నని నిడుదవోలు వేంకటరావుగా రభిప్రాయపడ్డారు. కాగా 'ప్రధాన గ్రంథంలో జేరి యుండ వలసిన దని, అన్యకర్తృక మనిపించటం లేదని' చేసిన వాదనలు అనంతర పరిశోధనల వలన అప్రాస్తము లయినాయి. శైలి, భాషా వైశిష్ట్యము పరిశీలించే శాస్త్రిగారి నిర్ణయానికి వచ్చారు. కాబట్టి అనుబంధ వర్గీకరణం శాస్త్రీయ పద్ధతి లోనే సాగిందిగా గ్రహించాలి.

ఎంతో శ్రమ కోర్చి, శాస్త్రిగారు రంగనాథ రామాయణాన్ని పరిష్కరించగా, దానికి వారు పీఠిక వ్రాయ నవకాశ మేర్పడలేదు. అది ఒక బృహత్కథ.

## వేంకటేశ్వర వచనములు :

తొలుత 1926 లో శాస్త్రిగారు వేంకటేశ్వర వచనములు కొన్ని ఎన్ని, భారతిలో ప్రచురించారు. పిదప తి. తి. దేవస్థానం వారు 'వైరాగ్య వచన మాలికా గీతము' లనే పేరుతో నలుబది ఏడు వచనాలను 1935 లో ప్రచురించారు. మరలా శ్రీ శాస్త్రిగారే మొత్తం 166 వచనాల్ని పరిష్కరించి తాము 'రీడరు'గా ఉండగా ప్రచురింపజేశారు. దీనికి వ్రాసిన పీఠికలో సంస్కృత గద్య రీతులు - ప్రాచీనాంధ్ర వచన రచనా రీతులు, ఇటువంటి మరికొన్ని వచన రచనల వివరాలతో వ్రాసినారు. చతుర్విధ వచన రచనలలో ఇది

'తాళగంధి చూర్ణిక' శాఖకు చెందిందని తెల్పారు ఆ మూలచూడంగా విషయాలు వివరించటం శాస్త్రిగారి పద్ధతి.

## అన్నమాచార్య సంకీర్తనలు :

4వ, 5వ సంపుటాలు పరిష్కరించి ప్రచురించారు. అన్నమయ్య పలుకుబడులు, సంకీర్తన లక్షణాలు - వాగ్గేయ కారులలో ఈతని స్థానము మున్నగునవి వివరిస్తూ పీఠిక రచించారు. వ్యాకరణ విధేయంగా లేవని పరిష్కరించిన వారివలె కాక, ఆ కాలపు భాషా రీతులు లెస్సగా ఎరుగుట చేత వానిని వికృతీకరించలేదు. శాస్త్రిగారి అనంతరం కొన్ని సంపుటాలు రాళ్ళపల్లి వారు, ఆ తరువాత గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారూ వెలువరించారు.

## ధనుర్విద్యా విలాసము :

దీన్ని మదరాసు రాష్ట్ర ప్రభుత్వం 12 వ ప్రచురణగా (1950) వెలువరించింది. యుద్ధతంత్రాన్ని గూర్చి తెల్పు మూడాశ్వాసాల కావ్యం ఇది. దీన్ని పరిష్కరించి విపులమైన పీఠికతో ప్రచురించారు. పీఠికలో విశ్వామిత్ర ప్రణీత ధనుర్వేదమును గూర్చి విశదీకరించారు. ధనుశ్శాస్త్ర గ్రంథా లెన్నింటినో వివరించారు. ఈ గ్రంథంలో ఉదాహరింపబడ్డ పారిభాషిక పదాలకు మూలం 'మహారాష్ట్ర ప్రాకృత'మని గుర్తించి కొన్ని ఉదాహరణ లిచ్చారు. మానవల్లి రామకృష్ణకవి గారి నుండి తాము గ్రహించిన విషయాలను కృతజ్ఞతతో స్మరించారు. సత్యనిష్ఠ శాస్త్రిగారిలో సర్వత్ర దర్శన మిస్తుంది. వారి పీఠికలు అనంతర పరిశోధకుల కుపాదేయా లైనాయి.

## శృంగారామరుకము :

తాళ్ళపాక తిరువెంగళప్ప అనువదించిన గ్రంథము. ప్రచురణ (1949). మూలము అమరుక కవి విరచితం. ఈ కవి అన్నమయ్యకు మునిమనుమడు. ఈయన నామలింగానుశాసన వ్యాఖ్యను, కావ్య ప్రకాశ వ్యాఖ్యను రచించాడు శాస్త్రిగారు, పెదకోమటి వేమారెడ్డి శృంగార దీపికా వ్యాఖ్య ననుసరించి శ్లోక సంఖ్య చేర్చారు. అందలి శ్లోకాలకు కొన్నిటికి తెనుగులో పద్యాలు లేనట్లు గుర్తించారు. 1919 లో నెల్లూరు జిల్లా సంచారంలో ఈ ప్రతిని సేకరించి

ప్రాచ్యలిఖిత పుస్తక శాలకు చేర్చిన దీయనే. అపపాఠములు సవరింపబడినాయి. రసహృద్యమైన ఈ కృతిని సంపాదించటమే కాక శాస్త్రిగారి చేతి మీదుగా ఇది పరిష్కరింపబడటం విశేషం.

## ఆంధ్ర కామందకము :

జక్కరాజు వెంకట కవి రచన. పరిష్కృత ప్రతి తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో 14 వ ప్రచురణగా 1950 లో ప్రచురింపబడింది. ఇది నీతి శాస్త్ర గ్రంథం. తప్పుల తడకగా ఉన్న ఒకే ఒక్క ప్రతి లభింపగా, దానికి ఛందో గణ యతి భ్రంశాలు దొర్లకుండా వేరొక ప్రతిని వ్రాయించారు ఇంకా సందిగ్ధాలు కన్పిస్తే, తంజావూరు మాతృకతో సరి చూచి, సంస్కృత మూలాన్ని చూచి పూరించారు. పూరణలు విడిగా చూపబడినాయి. "మూగవోయిన శాస్త్ర కావ్య వీణా తంత్రులను సవరించి, జీవగట్టు బిగించి, శ్రవణ పేయమైన నాద సుధలు స్రవించునట్లు మీటిన ప్రవీణులు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు."

## కాటమరాజు కథ :

ప్రభాకరశాస్త్రిగారు తామై ప్రచురించే ఉద్దేశ్యంతో తొమ్మిది తాళపత్ర ప్రతుల్ని పరిశీలించి, ఒక శుద్ధ ప్రతిని ముద్రణకై సిద్ధం చేశారు. శ్రీనాథుని రచనను అనుసరించి పినమల్లయ దీనిని రచించినట్లు శాస్త్రిగారు తెల్పారు. శాస్త్రిగారు దివంగతులైన పిమ్మట 1958 లో మల్లంపల్లి సోమశేఖర శర్మగారి పీఠికతో మదరాసు ప్రభుత్వం దీన్ని ప్రచురించింది. గ్రంథ కర్తను గూర్చి భిన్న మతాలున్నాయి. ఈ గ్రంథాని కనుబంధంగా 'బట్టు రాయబారము', అట్లే ఎఱ్ఱిగడ్డ పాటి పోట్లాట, కోటపాటి తాటివృక్షం తెచ్చే కథనూ అనుబంధంలో చేర్చారు. అనుబంధంలో వీటిని చేర్చటానికి రచనా ప్రభేదం కారణంగా శాస్త్రిగారు భావించినట్లు తోస్తుంది.

జానపద వాఙ్మయ విశిష్టతను తెలిసికోవాలంటే దేశి కవితా శాఖలో ప్రధానమైన ద్విపద కవితా శాఖయొక్క పరిశీలన ముఖ్యం అని తొలుత గుర్తించిన వారు శ్రీ ప్రభాకర శాస్త్రిగారు. "జానపదుల నాలుకలపై తేలికగా తేలియాడే దేశి సారస్వత సంపదంతా అనుభవయోగ్య"మనే శాస్త్రిగారి

తలంపు. ఇట్టి గ్రంథాలను పరిష్కరించటం వారి అభ్యుదయ దృక్పథానికి నిదర్శనం. జానపద సాహిత్యోద్ధారకులలో శాస్త్రిగారి స్థానము విశిష్టమైంది. శాస్త్రిగారు దీనిలో అపశబ్దాలను సవరించలేదు. కారణం మూలకర్త అట్లే వ్రాసియుండనోపు నన్న ప్రబల విశ్వాసం. శాస్త్రిగారు పీఠిక వ్రాయని గ్రంథాల్లో ఇది ఒక్కటి.

## సుభద్రా కళ్యాణము :

తొలి తెలుగు కవయిత్రి తాళ్ళపాక తిమ్మక్క కృతి వెలువరించు భాగ్యము పట్టినది శాస్త్రిగారికి. తిమ్మక్క అన్నమయ్య భార్య. ఈ కృతిని కాళహస్తి రాజావారి ఆస్థానము నుండి సేకరించింది కూడా వారే! ఈ పాటలోని పలుకుబడులు కొన్ని చేమకూర వేంకటకవి విజయవిలాసంలో చేరినట్లు గుర్తించారు. సుభద్రా కళ్యాణపు పాట అనియు ఈ రచనకు లోకమున వ్యవహార ముంది. రచన మంజరీ ద్విపదలో ఉన్నది. తాళ్ళపాక కవులు పెక్కురు పెండ్లి పాటలకి ఛందమునే స్వీకరించుట అందరికీ తెలిసిందే!

## పావులూరి మల్లన సారసంగ్రహ గణితము :

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు పరిష్కరించిన గ్రంథాల్లో ఇది చిట్టచివరిది. దీన్ని తొలుత 1912లో గుర్తించారు. మహావీరాచార్యుని గణితసారసంగ్రహమున కిది తెలుగుసేత అని తెల్పినది కూడా వీరే. 'బెంజమిన్'అను ఈస్టిండియా కంపెనీ ఏజంటు (సామర్లకోట) మల్లన గణితమః నాంగ్లము లోనికి తర్జుమా చేసినాడు.[1] శాస్త్రిగారు కొన్ని సాంకేతిక పదాలకు వివరణ లిచ్చారు. మూలంలో తెలుగునకు అనువాదాలు లేని తావులు వెదకి పట్టుకొన్నారు. సంస్కృత మూలంలోని కొలమానాలు మగధ సంప్రదాయ రీతిలో ఉండగా, ఆంధ్రీకర్త తెలుగు సంప్రదాయ రీతిలో వివరించినట్లు కనుగొన్నారు. మూలానికి విభేదించిన పట్టులు గుర్తించారు. గ్రంథ పాఠాలు చూపారు. శ్రీ ప్రభాకర శాస్త్రిగారు గ్రంథంలోని ప్రథమ భాగంలో గల పరికర్మ, భిన్న గణితాలు కలది మాత్రం పరిష్కరించటం జరిగింది మూల మచ్చుపడుతుండగనే శాస్త్రిగారు భౌతికదేహం వీడుటచే, దీనికి

---

1. పరిశోధన - 1954 ఆగష్టు.

వారి పీఠిక లేకుండా పోయింది. మిగిలిన గణితభాగా లిప్పటికీ పరిష్కరింపబడి, ప్రచురింపబడినట్లు కానరాదు.

మౌలికమైన ప్రతిభ-ఉపజ్ఞ-దీక్ష-సత్యనిష్ఠ - ప్రామాణికత వీరి పరిష్కరణలకు జీవాతువులు.

## వేంకటేశ్వర వాఙ్మయోద్ధరణ :

తాళ్ళపాక తిమ్మక్క సుభద్రా కళ్యాణము, తాళ్ళపాక తిరు వెంగళప్ప శృంగారామరుకము (1949) లను, వేంకటేశ్వర వచనములును (1945) శాస్త్రి గారి పరిష్కరణలతో ప్రకటింప బడినాయి. తాళ్ళపాక అన్నమయ్య సంకీర్తనలు 4వ, 5వ సంపుటాలు (1949) ప్రచురింపజేసినారు. అంతమాత్రమే కాక అన్నమాచార్య చరిత్రను, ఆయన మనుమడు చిన తిరువేంగళనాథు డను పేరు గల 'చిన్నన్న' ద్విపదలో రచించినాడు. దానిని పరిష్కరించటమే కాక పీఠికగా 'అన్నమాచార్య చరిత్ర' యను పేరుతో సుమారు 150 పుటల గ్రంథాన్ని రచించారు. ఈ మూల కృతిని వెలికి తీసింది కూడ వారే. వారి పీఠికలో అన్నమాచార్య చరిత్ర, తత్సంతతి, వడ్డి కాసులవాని వైభవము, సంకీర్తనల విశిష్టత, ఆ నాటి కవితా రీతులు - సమకాలీన ప్రభువుల చరిత్రలు, కపిలేశ్వర, పురుషోత్తమ గజపతుల దండయాత్రలు, స్థల పురాణములు, ఇట్లే ఎన్నో విషయాలు త్రవ్వి వెలికి తీసి రాశిగా పోశారు. అన్నమాచార్యులు అర్చించిన విగ్రహాలను సేకరించారు. తాము స్వయంగా శిష్యులతో తిరుమల కొండపై కేగి, శ్రమకోర్చి, 'తాళ్ళపాక వారి అర'లోని రాగిరేకుల దొంతరలను వెలికి తీయించిన భాషా లోలుడు.

అన్నమాచార్యోత్సవ కల్పన మొనరించి, సంకీర్తనల ప్రచారానికి క్రొత్త ఊపిరి పోసింది ప్రభాకర శాస్త్రిగారని చాలామందికి తెలియదు. ఇప్పు డింత విజృంభమాణంగా జరుగుతున్న అన్నమాచార్య వర్ధంతులకు మూలపురుషుడు ప్రభాకర శాస్త్రిగారే!

## శ్రీ వేంకటేశ్వర లఘు కృతులు :

ఇది 1945 లో ప్రకటింపబడింది. ఇది సంకలన గ్రంథం. శ్రీ వేంకటేశ్వరస్వామిని ప్రధానీకరించుకొని భక్తులు రచించిన రచన లిందున్నాయి.

ఇందు పన్నెండు కృతులు అజ్ఞాతకర్తృకాలు తక్కిన ఏడును జ్ఞాతకర్తృకములు, చెల్లాచెదురుగా పడిఉన్న కృతులను వెలికిదీసి భక్తుల కందించటం, విడివిడి పదాలకు ఒక అనుపూర్వి కల్పించటం, ఉత్తరోత్తర పరిశోధనకు ప్రరోచన కావడం ఈ ప్రచురణవలని ప్రయోజనాలుగా శాస్త్రిగా రాశించారు. ఇది కాక ప్రాచీన గ్రంథాల్లోని శ్రీ వేంకటేశ్వర వర్ణనా స్తుతులనెల్లా శాస్త్రిగారి పర్యవేక్షణలో సేకరించటం జరిగింది. ఇది కూడా ఒక సంపుటంగా వెలువరించాలని శాస్త్రిగా రాశించారు. అది ఇంకను ప్రకటింతం కాలేదు.

## లక్షణోద్ధారము :

ఇది 1948లో శాస్త్రిగారు తిరుపతిలోనే తలపెట్టిన సంకలన కృతి. ప్రభాకర శాస్త్రిగారు ప్రణాళికను ఇట్లు నిర్దేశించుకొన్నారు : 1. లక్షణ గ్రంథాల పట్టిక, 2. వీనిలోని లక్ష్యలక్షణ గ్రంథాల పేళ్ళు, 3. అన్ని లక్షణగ్రంథాలలో ఉదాహృతాలైన లక్షణ గ్రంథాల పట్టిక, పద్యాల సంఖ్య, 4. లక్షణగ్రంథోదాహరణోద్ధారము, 5. లక్ష్యగ్రంథోదాహరణోద్ధారము సాకల్యంగా ఈ ప్రణాళికను పరిశీలించినట్లైతే లక్ష్య లక్షణగ్రంథ సర్వస్వ మన్నట్లుండుటయే కాక, ఛందశ్శాస్త్ర పరిధి - ఏతదభ్యుదయము - వాని అనుశీలనము, సర్వకవితా రీతుల పరిశీలనము ఇందు వివరింప దలపెట్టినట్లున్నది. ఇది ఒక భగీరథ కృషి. ఇది వారి చేతులమీదుగా పూర్తియైనట్లైతే ఛందో లక్ష్య లక్షణాలకు సర్వసమగ్ర గ్రంథంగా ఇది భాసిల్లేది. ఇంతటి బృహత్తర సంకలన గ్రంథరచనకు ఏతమెత్తిన ప్రభాకరశాస్త్రిగారి ధిషణా చారిమా, దీక్షా, ధురంధరతా దొడ్డవి.

## ఉత్తర హరివంశ వ్యాఖ్య :

నాచన సోమనాథుని ఉత్తర హరివంశ మొక దురవబోధమైన ప్రాచీన పద్య కృతి. శాస్త్రిగారు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయంలో 'రీడరు'గా ఉంటున్నప్పుడు 1945-49 నడుమ ఈ కృతికి వ్యాఖ్య వ్రాయనారంభించారు. ఏక కాలంలో పలు గ్రంథాల పరిష్కరణ, ప్రచురణలతో ఇది సాంతము కాలేదు. శ్రీ శాస్త్రిగారి వ్యాఖ్య 4వ ఆశ్వాసంలోని 'ఉరము

కౌస్తుభ రత్న' అను పద్య పర్యంతమూ సాగింది.[1] వీరి వ్యాఖ్యయందున్న కొన్ని విశేషాలు: 1. ప్రతి ఆశ్వాసానికీ ముందు కథాంశాలు శీర్షికా రూపంలో సూచించటం (పూర్వ వాఖ్యాత లిట్లా చేయలేదు), 2. అవసరమైన పట్టు లందు సంస్కృత మూలము నివ్వటం, 3. ఎఱ్ఱాప్రెగడ హరివంశము పట్టులతో పోల్చి విలువలు కట్టటం, 4. పాఠ భేదా లున్నచోట అన్నింటినీ ఉదాహరించి, సాధు పాఠ నిర్ణయం చేయటం, 5. సుగమమైన పద్యాలను వదలివేయటం, 6. పూర్వ పరిష్కర్తల పాఠ పరామర్శ, 7. సుదీర్ఘ వచనాలున్న తావుల అవి యేయే కవుల అనుసరణలో తెల్పి, సారస్య వైరస్యములు వివరించటం, 7. దురవబోధమైన పట్టులందు అరటి పండొలిచి చేతి కందిచ్చినట్లు విశదీకరించటం, ఔచిత్య విచార చర్చ, తులనాత్మక పరిశీలన, అర్థ వివరణ, కావ్య ధర్మ సమన్వయం, నిఘంటు ప్రమాణాలు చూపటం, కవి మూలాతిరిక్తంగా అధికాలు చేర్చటం వంటి ఎన్నో యిందు దర్శన మిస్తాయి. చివరిదాక వ్యాఖ్య సాగియున్నట్లయితే ఆంధ్ర వాగ్దేవి కంఠహారమయి యుండే దనటంలో ఏ సందేహమూ లేదు.

## నన్నెచోడ కుమారసంభవ వ్యాఖ్య :

ఈ వ్యాఖ్యాన రచనకు 1948 లో ప్రోత్సాహం కల్గించినవారు పిఠాపురం మహారాజా శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు. ఈ రచనకు నాందిగా మూలమును 8 ఆశ్వాసాల పర్యంతమూ పరిష్కరించి సవరణ పట్టికలు సిద్ధము చేశారు. దీనికి పరిష్కర్త, వ్యాఖ్యాత ప్రభాకరశాస్త్రులవారే. ప్రథమాశ్వాసములోని 36 వ పద్యంవరకు వ్యాఖ్యానం సాగినది. ఇంతలో జమీందారీల రద్దు చట్టం రాగా, శ్రీ రాజావారీ ఉద్యమాన్ని వదులుకొన్నారు. దానితో ఈ వ్యాఖ్యా ఆగిపోయింది. ఆ తర్వాత శాస్త్రిగారి శిష్యులు ఆచార్య తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు తొలి రెండాశ్వాసాలకు టీకను వ్రాసి, 'త్రిలింగ' పత్రికలో ప్రకటించటం జరిగింది.

---

1. డా॥ వేటూరి ఆనందమూర్తిగారు ఈ వ్యాఖ్యను తొందరలో ప్రచురింపనున్నారు.

## ఆధునికుల కృతులకు పీఠికలు :

గ్రంథ మేదైనా ఒకే మూసలో పీఠికలు కూర్చేవారు కొందరు, ఫలాపేక్ష తోనో, కీర్తికండూతికో ప్రచారలబ్ధికో వ్రాసేవారు కొందరు, మెచ్చికోలు వ్రాతలు వ్రాసేవారు కొందరు, రచన ఏదైనా కొన్ని పడికట్టు పదాలతో పొగడ్తపొలంలో పరిభ్రమించేవారు కొందరు, తమ అంతస్థుకు తగవని రచయితలను విసరికొట్టేవారు కొందరు. గ్రంథసారం ప్రధానం కాక ఇతరేతర కారణాలతో రచనలను ఆకాశాని కెత్తేవారు కొందరు, తమ సిద్ధాంతాల కనువుగా లేకపోతే తెగడుతూ, అనుకూల మైతే హర్షిస్తూ కొందరూ పీఠికా రచనలు చేస్తూండటం లోకంలో చూస్తున్నాము.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు రచయిత ఎత్తు ననుసరించి కాక, రచనలోని అంతస్సారాన్ని పురస్కరించుకొని తమకు నచ్చిన, తాము మెచ్చిన, తమ హృదయాన్ని కదల్చిన సారభూతమైన కొన్నింటికి మాత్రమే పీఠికలు వ్రాశారు. వారి పీఠికల విలువ గుర్తించి ఎందరో వచ్చేవారుగాని, ఒక పట్టాన ఆయన ఒప్పుకొనే వారు కాదు. అందుచేతనే వారు ఆధునిక కృతులకు వ్రాసిన పీఠికలు మరీ పరిమితం. సత్యనిష్ఠతో గుణ, దోష నిర్ణయం చేయటం వారి ప్రవృత్తి. వారి అంతఃకరణకు తోచిన విషయాలు మొగమోటమి లేక నిర్భయంగా ప్రకటించటం వారి కలవాటు.

## భారతీ శతకము :

కళాప్రపూర్ణ గిడుగు వెంకట సీతాపతిగారు కర్త. సమకాలీన కృతులకు వ్రాసిన పీఠికలలో మొట్టమొదటిది (1939). ఈ శతకంలో భాషోత్పత్తి వికాసాల తీరు తెన్నులూ, కావ్యభాషాభ్యుదయ సాధనాలూ నిరూపింపబడినాయి. వాఙ్మయ విమర్శనాత్మకమైనా ఇటువంటి రచన ఇంతదనుక రాలేదు ఆ పీఠికలోని కొన్ని వాక్యాలు శాస్త్రిగారి దృక్పథాన్ని వెల్లడి చేస్తున్నాయి: "రేపు స్వరాజ్యము వచ్చి, ఆంధ్ర రాష్ట్రము వేరుపడి, కౌన్సిళ్ళలో ఆంధ్ర భాషా వ్యవహారము సాగి, తెలుగు పోర్టు హెందు ప్రబలమై, దైవానుగ్రహము దైవారితే పెద్దలు సభలలో వ్యవహరించిన భాషా వ్యవహారము స్వస్వరూపముతో పత్రికలలో ప్రకటితము కావలెనే కాని, అవి నన్నయభట్టీయాధర్వణీయాది వ్యాకరణ పారాయణ పరాయణులచే పరిసంస్కృతమై ప్రకటితము కారాదు." భాషా పరిణామము నభ్యూహించి

శాస్త్రిగారు వ్రాసిన వాక్యాలు ఇవి. వ్యావహారిక భాషావాదాన్ని తొలిదశనుండి (1913) సమర్థించుచూ వచ్చిన శాస్త్రిగారు ఆ ఉద్యమానికి తనువు ధార పోసిన సీతాపతిగారి కృతికి పీఠిక వ్రాయటం అత్యంత సముచితం.

## మొయిలు రాయబారము :

కాళిదాసు 'మేఘసందేశ'మునకు గేయానువాదం. రచయిత శ్రీ త్రిపురాన వేంకటసూర్య ప్రసాదరాయ బహద్దరు. శ్రీశ్రీశ్రీ రాజా విక్రమదేవ వర్మ గారి గౌరవాస్థానకవులు. ఈ పీఠికలో కాళిదాసు కాలచర్చ, ఇంకెన్నో విషయాలు ప్రస్తావింపబడినవి. 'పరివర్తనము రససిద్ధుని రచనమవటం, ఛందము దేశి కావటం ఈ కృతికి పొలుపును జేకూర్చినవి.' యక్షగాన ఫణితిలో చేయబడిన కృతి. ఇందు శాస్త్రిగా రొక చక్కని సూచన చేశారు. అభినవ కాళిదాస, అభినవ వాల్మీకి, అభినవదండి వంటి బిరుదు లాంధ్రీకర్తలకు కాక, మౌలిక ప్రతిభతో ఆంధ్రవాఙ్మయమున అంతటి స్థానము నాక్రమించి, స్వతంత్ర రచనములు చేసిన వారి కా యా బిరుదు లిచ్చుట, చెల్లుట తగునని మొగమోటమి లేకుండ స్పష్టంగా తెల్పినారు.

## ఆంధ్ర రచయితలు (1944) :

రచయిత కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు ఇది తొలి ప్రచురణ. ఆ తర్వాత విస్తృత సంపుటము వెలువడింది. కందుకూరి వారి కవుల చరిత్రకు పరిశిష్ట గ్రంథంగా ప్రవర్థిల్లుగాక అని ఆశీర్వదిస్తూనే,ఆ గ్రంథంలో ఉండదగ్గ రచయితల్ని పదునాల్గునుపీఠికలో పేర్కొన్నారు. కవుల చరిత్ర విషయంలో శాస్త్రిగారి ప్రజ్ఞ అంత సునిశిత మైంది. రచయిత కవులను గూర్చి వ్రాసిన పలుకుబళ్ళు భాషలో పాడుకొనదగి ఉన్నవంటూ ప్రశంసించారు. ఇదీ శాస్త్రిగారి తీరు. తృణ మణి వివేచనం వారి సొత్తు.

## శివ భారతము :

మహాకవి గడియారము వేంకటశేషశాస్త్రిగారి కృతి. ఒకే తీవను పూచిన రెండు పూవుల వంటి వారు వేంకటశేషశాస్త్రిగారు, దుర్భాక రాజశేఖర శతావధానిగారున్నూ. ఈ ఇద్దరు మరల కలిసి తిరుపతి వేంకట కవుల వలె ఏకమై

రభస సాగించటం లెస్స అంటూ హితం చెప్పి, కావ్యగుణ వివేచన చేస్తూ విపుల మైన పీఠిక వ్రాశారు కాని, ఈ పీఠిక అచ్చుపడలేదు. ఇది మేము విద్యార్థులుగా ఉన్నప్పుడు శాస్త్రిగారు చేసిన రచన. అప్రియంగా ఉన్నా సత్య ధర్మాలు నివేదించటంలో శాస్త్రిగారు జంకెరుగరు.

కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారి విక్రమాంకదేవ చరిత్ర (అనువాదము)కు, అప్పల నృసింహశర్మగారి 'గురునాథ విజయ'మను సంస్కృత శతకానకు, శాస్త్రిగారి శిష్యుడు శ్రీ జయిరెడ్డి సుబ్రహ్మణ్యము రచించిన 'గాంధీ' శతకానికి అభిప్రాయాలు గద్య, పద్యాలలో ఒనర్చినారు.

## ప్రజ్ఞాప్రభాకరము (స్వీయ చరిత్ర) :

రచనా కాలము 1949 - 50. ఈ రచనకు శాస్త్రిగారి రెండవ కుమార్తె సుజాత వివాహ సందర్భంలో సాయంకాలం జరిగిన ప్రార్థన సమావేశంలో 29-5-1949 న శ్రీకారం చుట్టినారు. జీవితోదంతము, ప్రజ్ఞా జీవితోదంతము తెల్పు రచన. ఇందు లౌకిక జీవితం ప్రధానం కాక, దివ్య ప్రజ్ఞా మయమైన అను భూతి విశేషాలు వెల్లడిచేయ నిశ్చయించారు. అట్లయ్యును ప్రామాణికంగా వారి జీవిత విశేషాలు తెల్పుచున్న గ్రంథ మిదొక్కటే. వ్యక్తిగత విషయాలతో పాటు బాల్యస్మృతులు, చెళ్ళపిళ్ళవారి శిష్యరికము, ప్రాచీన గ్రంథ గవేషణకై తెలుగు దేశ సంచారము, పావులూరిమల్లన కాలం గూర్చిన వాద ప్రతివాదాలు, నాడీ గ్రంథాల ప్రస్తావన, తంజావూరు లైబ్రరీ విచిత్ర విక్రయగాథ, అంతర్వీక్షణకై బాల్యమునుండీ తపన, పరమగురువులు మాష్టరు సి. వి. వి. గారి దివ్య దర్శనము ప్రత్యక్షంగా జరుగుతున్నట్లు వర్ణించిన తీరు - ఇట్లెన్నో విషయాలు ఇందులో ఉన్నాయి. పరమ గురువులతో వారి సంభాషణము, గురుదేవుల సందేశాలు వెల్ల డించారు. వేయి పుటలుగా తమయొక్క, తమతోడి వారియొక్క యోగానుభూతులు వివరిస్తూ వెలయవలసింది. కాని శాస్త్రిగారు తమ 28 వ ఏటి వరకు గడచిన ఉదంతాన్ని మాత్రమే వ్రాయుట జరిగింది. పూర్ణ గ్రంథమే వెలువడినట్లైతే యోగవిషయంలో అది ఒకమహత్తర గ్రంథంగా విరాజిల్లేది అనటంలో సందేహం లేదు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 1950 లో పరమపదించుటతో గ్రంథరచన పూర్తి

కాలేదు. ఆయన స్వవిషయంలో నిర్లిప్తతయు ఒక కారణంగా కనపడుతుంది. స్వీయ చరిత్ర రచన కిది ఒజ్జబంతి అనదగినట్లున్నది.

## పరిష్కృతములు - అముద్రితములు :

1. కాశీఖండము, 2. శివతత్త్వసారము (కన్నడాంధ్ర కృతు లెదురు బదురుగా), 3 కవిలోక చింతామణి, 4. నైషధ పారిజాతీయము, 5. బేతాళ పంచ వింశతి, 6. ఎలకూచి బాల సరస్వతి 'శారీరము',

'తెలుగు మెఱుగులు' వ్యాససంపుటి శాస్త్రిగా రుండగా ఆంధ్రపత్రిక వారు ప్రచురించినారు (1948). మీగడ తఱకలు, సింహావలోకనము వారు గతించిన తర్వాత వెలువడ్డ వ్యాస సంపుటలు.

తిరుపతిలో ఉండగా మదరాసు ఆకాశవాణి వారి కోరిక మేరకు వ్యావహారిక భాషలో 'గౌరీ కళ్యాణము' ను రేడియోనాటికగా రచించారు. ఆ నాటిక 22-2-44 శివరాత్రి నాటి సాయంకాలం ప్రసారమైంది. నాలు గంకాల కథ; పర్వతాల పేర్లే ఇందులో వ్యక్తులపేర్లుగా ఉన్నాయి. సింగి, సింగడు పాత్రలను ప్రవేశ పెట్టారు. ఇవి జానపద పాత్రలు. ఇది శ్రోతలచే ఎంతో మెప్పు పొందటం మా యెఱుకలోనిదే!

## మ్యూజియము కల్పన :

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిపై తి. తి. దేవస్థానంవారు ఒక మ్యూజియం రూపొందించే భారాన్ని మోపినారు (1948-49). అందులకై శాస్త్రిగారు రాత్రిం బవళ్ళు ఆహార నిద్రా సౌకర్యాలు వదలి, పులులు చెరలాడే కడప అడవులు మొదలు కొని ముక్త్యాల, తెలంగాణాలలోని నల్లగొండ గుట్టలవరకు గాలించారు. ఆ గాలింపులో ఎన్నో సుందరమైన జిన, బౌద్ధ, హిందూ విగ్రహాలు సేకరించి తిరుపతికి చేర్చారు. ఇది ఇట్లా ఉండగా, కాళహస్తి సంస్థానం పురావస్తు భాండార మంతా శోధించి, ఆ సంస్థానాధిపతుల అనుమతితో ఎన్నో అముద్రిత గ్రంథాలూ, చిత్రాలే కాక, పూర్వపు వీరులు ధరించిన కవచాలూ, ఖడ్గాలూ సేకరించారు. ఆ పిమ్మట ఆంధ్ర ప్రభ సంపాదకులు శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారి సాయంతో బందరులో ఉన్న కోట సుబ్బారావు గారు ఎంతో కాలం శ్రమించి సేకరించుకొన్న అమూల్యములైన చిత్ర ప్రతిమాదులను శాస్త్రిగారు తిరుపతికి తరలించారు. తాళ్ళపాక తిమ్మక్క

'సుభద్రా కళ్యాణం' ప్రతి కాళహస్తి సంస్థానం నుండి సేకరించిందే! ఇప్పటికీ అవన్నీ తిరుపతిలో మూగవోయి ఉన్నాయి. ఈ అపూర్వ శిల్పాలవల్ల ఆ నాటి సాంఘిక, రాజకీయాంశము లెన్నో తెలియవలసి ఉన్నాయి చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు ధరించిన పావుకోళ్ళు, ఇతర వస్తువులూ, వారి గ్రంథ జాలంతో బందరులో ఒక 'మ్యూజియం' నెలకొల్పాలని సంకల్పించి కొంత కృషి గావించారు.

1949 లో ముక్త్యాల రాజావారి తోడ్పాటుతో ఆ చుట్టుపట్టులం దున్న ప్రాచీన శిథిల శిలాఖండాలు ముక్త్యాలకు చేర్చినారు. అక్కడ కూడా ఒక ప్రదర్శన శాల ఏర్పాటు చేయాలని శాస్త్రిగారి సంకల్పం. ఇక్ష్వాకుల నుండి కాకతీయుల పర్యంతమూ గల శిల్పాలూ, శాసనాలూ సేకరించటమే కాక, కాకతమ్మ, సేనాపతి జాయప్ప, తాడి ముత్తా వీరుడు మొదలగువారి శిలా మూర్తులు వారి సేకరణంలో ఉన్నాయి. చరిత్ర పూర్వ సమాధులను త్రవ్వించి, అందులో లభించిన వస్తువు లన్నీ ఒకచోట చేర్చారు. బౌద్ధాంధ్ర కళ అన్నా, బౌద్ధ స్తూపాలన్నా శాస్త్రిగారి కత్యంతాసక్తి. ప్రాచీన శిల్ప కృతులను పరిశీలించటంలో శాస్త్రిగారి కెడతెగని అభిలాష. భోగాలపాటి దిబ్బ శిలా శాసనాలు, శిథిలావశేషముల గూర్చి ఎన్నో విషయాలు వెల్లడించారు.

ఒకసారి శాస్త్రిగారు చిత్తూరు సమీపంలోని 'వేలంజేరి'లో సుందర విగ్ర హాలు ఊరి చెఱువు గట్టు దగ్గ రున్నా యని తెలిసికొని శిష్యులు శ్రీ ఏ.వి. శ్రీనివాసా చార్యులుగారితో వెళ్ళారు (6-4-50). వడివేలమ్మ విగ్రహం కనపడ్డది. 'బిడ్డకు పాలిస్తున్న తల్లి విగ్రహం, మహా మనోహరం అని శాస్త్రిగారు డైరీలో వ్రాసు కొని, ఒక చక్కని పద్యాన్ని కూడా కూర్చినారు.

కం. 'వేలంజేరి' పురమ్మున
ఫాలాక్షుని యాన వడసి బాలేందు ముఖీ!
ఏలావతి ! నీ భక్తుల
పాలింపవె ! పసిడి బొమ్మ ! వడివేలమ్మా !.

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు దివంగతు లవటానికి నాల్గు రోజుల ముందు తెనాలి తాలూకా చుద్దనపూడికి వెళ్ళారు. అది వర్షకాలం. అంతా బాడీబంద. అయినా

తా మొక్కరే వెళ్ళి ఊళ్ళో ఒక పాడునూతిలో విగ్రహా లున్నాయని అక్కడున్న వారికి తెల్పి, ఆ విగ్రహాలు వెలికి తీయించారు. అవి అపూర్వ శిల్పాలు. ఆ రోజు మకాం చేసింది యస్. దాశరథిగారింట. ఆయన ఇప్పుడు కాకినాడ ప్రభుత్వ మ్యూజియం క్యూరేటరుగా ఉన్నారు. ఆయనతో నేను ప్రసంగిస్తూంటే ఈ విషయం చెప్పి, 'ఆ వయస్సులో శాస్త్రిగారికి శిల్పసేకరణలో ఉన్న దీక్షా, కార్య ధురంధరతా ఎన్ని కష్టనష్టా లున్నా వారి పట్టుదలా తల్చుకుంటే ఇప్పటికీ నాకా శ్చర్యం వేస్తూంటుం'దన్నారు జీవిత చరమభాగంలోకూడా శాస్త్రిగారి సేవ అపూర్వ శిల్ప సేకరణకే అంకిత మవటం ఒకచిత్ర సంఘటన!

## గాంధి తత్త్వారాధకులు :

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తొలినుండి జాతీయ భావ ప్రపూర్ణులు. 1910 నుండి జాతీయోద్యమాన్ని చాలా సూక్ష్మంగా పరిశీలిస్తూ వాటిని విశ్లేషిస్తూ వచ్చారు. మహాత్మునిపై ఎన్నో కవితలు వెలయించారు. ప్రధానంగా గాంధీ గారి ఆధ్యాత్మిక సంపద, ఉభయ సంధ్యలందు ప్రార్థన, అహింసా వాదము శాస్త్రిగారి మనస్సును చూరగొన్నాయి. కరుణామయులైన ప్రభాకరశాస్త్రిగారికి అహింసా తత్త్వారాధకుడైన గాంధీజీ ఆరాధ్యుడైనాడు. గాంధీ ఉపవాస దీక్ష చేసినప్పు డెట్లా ఆయన విల విల లాడిపోయేవారో ప్రత్యక్షంగా ఎరిగినవాణ్ణి నేను. పురుషోత్తముడుగా బాపూజీని భావించిన మహనీయులు శాస్త్రిగారు. గాంధీజీ నిర్దేశించిన హరిజన దేవాలయ ప్రవేశోద్యమానికి తిరుపతిలో నాయకత్వం వహించిం దాయనే అని చాలామందికి తెలియదు.

గాంధీ ఆకస్మిక మరణం శాస్త్రిగారి ప్రాణ మూలాన్ని కదల్చి వేసింది. ఆ మహాపురుషుని నిర్యాణం వారికి జీవితం యెడలనే నిరాసక్తత కల్పించింది. గాంధీగారు పోయిన పదో రోజున శాస్త్రిగారు మద్రాసు ఆకాశవాణిలో ప్రసంగిస్తూంటే మధ్యలో కొన్ని క్షణాలు దుఃఖోద్విగ్నత కారణంగా నోట మాట రాలేదు. విన్న శ్రోత లంతా కంట తడి పెట్టారు ఆ ప్రసంగానికి.

గాంధీగారు మరణించినప్పు డెవ రెట్లా ప్రతిస్పందించారో, వారి వారి భావ పరంపర లెట్లా సాగినాయో 'రికార్డు' చేసి పంపమని పత్రికా ముఖంగా ప్రకటన చేశారు. పిన్నలూ, పెద్దలూ ఎంతో మంది అట్లా పంపారు. 'గాంధి రామాయణం' అనే పేరుతో వాటి నన్నింటినీ సంకలనం చేసి ప్రచురించా లనుకొన్నారు. శాస్త్రి గారి హఠాన్మరణంవల్ల ఆ ప్రకటన కార్యక్రమం అంతటితో ఆగిపోయింది. దేశం మొత్తం మీద అట్లా ఒక మహా పురుషుని నిర్యాణం ప్రజల్లో రేపిన భావాలను యథాతథంగా 'రికార్డు' చేయా లనే తలంపు శాస్త్రిగారి కొక్కరికే కలిగింది. ప్రభాకరశాస్త్రి మహోదయుల మౌలిక ప్రజ్ఞ ఏ రంగంలోనైనా క్రొత్త త్రోవలను తీయ గలట్టి దని అవగత మవుతుంది, పరిశీలిస్తే!

# 16. పాల్గొన్న సాహిత్య సభలు

లభించిన ఆధారాలను పట్టి పరికిస్తే, చెప్పుకోదగిన తొట్ట తొలి సభ రాజమహేంద్రవరంలో 1922 లో జరిగిన రాజరాజ నరేంద్ర పట్టాభిషేక వర్ధంతి సభ. అది రాజరాజ నరేంద్రుని పట్టాభిషేక మయి తొమ్మిది వందల సంవత్సరాలు పూర్తియైన సందర్భంగా జరిగింది. ఆ సభలో 'నన్నయకు పూర్వపు ఛందస్సు' అనే దానిపై ఆలోచనాత్మకమైన ప్రసంగం చేశారు. రాజరాజ నరేంద్ర ప్రశంస చేస్తూ కొన్ని పద్యాలు రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచికలో ప్రచురించారు. మచ్చున కొక్క పద్యం-

 మ. మద మాతంగ తురంగ ముఖ్య పద సంపన్నుండు నన్నయ్య తొ
మ్మిది నూరేండ్లకు ముందుఁ జూపె కవితోన్మేషంబు సర్వాంధ్ర సం
పద పెంపొంద చళుక్య వల్లభుఁడు సామ్రాజ్యాభిషిక్తుండుగా
నది నా ఁటికి నేఁటి కబ్బునటె వ్యాఖ్యానింప నాఖ్యానమున్.

1939 లో రెడ్డి రాజ్య వర్ధంతి సభ కూడా రాజమహేంద్రవరంలోనే జరిగింది. ఆ నాటి సభకు అధ్యక్షత వహించి శాస్త్రిగారు రెడ్డి రాజుల చరిత్ర, సాహిత్య పోషణలపై మహోపన్యాసం చేశారు. ఆ ప్రసంగమే 'సింహావలోకనం' వ్యాస సంపుటిలో మరలా అచ్చుపడింది. న్యాయవాది వడ్డాది అప్పారావుగారు ఆ వర్ధంతిసభకు సారథ్యం వహించారు. డా॥ కట్టమంచి రామలింగారెడ్డి ప్రభృతులు ఉద్దండు లెందరో ఆ సభలలో పాల్గొన్నారు.

రాజమహేంద్రవరంలోనే కవి రాజహంసలు వేంకట పార్వతీశ్వర కవుల సన్మాన సభ 26-12-1943 న మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ కొంతిరామమూర్తి, ఐ.సి.యస్. గారి అధ్యక్షతను జరిగింది. ప్రభాకరశాస్త్రి గారిని ప్రధాన వక్తలుగా ఆహ్వానించారు. అప్పుడు మేము తిరుపతిలో శాస్త్రిగారి దగ్గర చదువుకొంటున్నాము. కొన్ని అనివార్య కారణాలవల్ల శాస్త్రి గారా సభకు

వెళ్ళలేదు. 'కవితా పారమ్యము' అను పేర ఒక మహత్తర వ్యాసాన్ని ఆ సభకు పంపారు. తాత్త్వికత కవితా శిఖరంగా ఎట్లు పరిణమిస్తుందో, 'ఏకాంత సేవా'కావ్యం, వేంకట పార్వతీశ్వర కవులు ఎట్లా ఆ లక్ష్యాన్ని చేరుకోగలిగిందీ వివరిస్తూ, కవితా చరమలక్ష్యము పరమార్థ విస్ఫురణమే అని నిరూపించారు. ఆ తరువాత అది 'తెలుగు మెఱుగులు' వ్యాస సంకలనంలో అచ్చు పడింది కూడా !

కృష్ణా జిల్లా ముక్త్యాలలో నవ్యసాహిత్య పరిషత్ ఏకాదశ వార్షికోత్సవం (6-1-1946) జరిగింది. ఆ సభలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ఉపక్రమోపన్యాసం చేశారు. ముక్త్యాల కుమార రాజా శ్రీ వాసిరెడ్డి శ్రీ రామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాద బహద్దరు వారు సభలను నిర్వహించారు. ఆయన మంచి సాహితీ రసజ్ఞుడు. కవితాప్రియం భావుకుడు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ప్రాచీన సంప్రదాయ కవులకు, నవ కవులకు సువర్ణ సుందర సేతువు వంటివారు. ఆ సభలకు మల్లంపల్లి, కాటూరి, గడియారం, వేలూరి మాత్రమే కాక తల్లావజ్ఝుల, దేవులపల్లి, ఇంద్రగంటి, వేదుల మున్నగు వారెందరో వచ్చారు. జగ్గయ్యపేట నుండి ముక్త్యాలవరకు అడుగడుగునా కవులకు, ఇన్ని మైళ్ళూ స్వాగత తోరణాలే. అప్పట్లో అంత వైభవోపేతంగా జరిగిన కవి, పండిత సభ మా యెఱుకలో అదొక్కటే. ఆ నాటి ప్రసంగంలో శాస్త్రిగారిట్లా అన్నారు: "నేటి నవ్యసాహిత్య విశారదుల నవనవో జ్జృంభణము లన్నీ నాకు పరమానంద ప్రదములే. మన పరిపూర్ణత రేపటి రోజుల్లో ఉన్నది గాని నిన్నటి రోజుల్లో లేదు. సాహిత్యం ఏ కొద్ది మందికో కాదు- అన్ని వర్గాలవారికీ అనుభవింప దగినదిగా ఉండాలి" అని ఆంధ్రజాతిని మేల్కొల్పిన కొద్ది మంది వైతాళికులలో ఆయన ఒక్కరు. తొలి నాళ్ళలో ముఖ్యులు.

శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి ప్రథమాంధ్రాస్థాన కవి పట్ట ప్రదానోత్సవ సభ (1949, అక్టోబరు) విజయవాడ 'లీలామహల్'లో వైభవోపేతంగా జరిగింది. ఆ సభలకు ముగ్గురు రాష్ట్ర ముఖ్యమంత్రులు (అంతా తెలుగువారే) మైసూరు, మద్రాసు, నైజాము రాష్ట్రాలకు పాలకులుగా ఉన్న సర్వశ్రీ కె సి. రెడ్డి, పూసపాటి కుమారస్వామి రాజా, బూర్గుల రామకృష్ణరావులు విచ్చేశారు. చెళ్ళపిళ్ళ వారి శిష్యులు విశ్వనాథ, పింగళి, కాటూరి, వేటూరి ప్రభృతులు గురువుగారికి బ్రహ్మరథం పట్టారు. ఆ నాటి సాయంకాలం అభినందన సభకు వేటూరి ప్రభాకరశాస్త్రిగారధ్యక్షులు. టంగుటూరి ప్రకాశం పంతులుగారు

సభా ప్రారంభకులు. ఆ నాటి సభా కార్యక్రమా లన్నీ సాహితీ రసజ్ఞులు శ్రీ యస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావు, (తూ.గో. జిల్లా పరిషత్ మాజీ ఛైర్మను) వీడియో చిత్రం తీయించినట్లు విన్నాను-అది వారి దగ్గర ప్రస్తావింపగా 'ఔను' అన్నారు.

రాజమహేంద్రవరంలో కలాభివర్ధనీ పరిషత్తు, కథకచక్రవర్తి శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మహాకవి మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారల సంయుక్తాధ్వర్యవంలో ప్రతి యేటా నన్నయ జయంతీ, శ్రీనాథ జయంతీ జరుపుతూండేది. 1949 అక్టోబరులో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిని శ్రీనాథజయంతి సభకు ప్రధానవక్తగా ఆహ్వానించి, ఘనంగా సన్మానించారు శ్రీనాధునిపై ప్రామాణిక గ్రంథం వ్రాసిందీ, శ్రీనాథ సారస్వతంపై కూలంకషంగా పరిశ్రమించిందీ కూడా శాస్త్రిగారే, ఆంధ్ర కవితావాహిని ప్రవహించిన తీరూ, శ్రీనాథుని కవిత్వపు లోతులూ, మర్మములూ, ప్రాచీనాంధ్రకవితా ధోరణులూ ఇట్లెన్నో విషయాలు ప్రసంగంలో దొర్లాయి. ఆ సభలో నేనూ ఒక శ్రోతను. శ్రీ శాస్త్రిగారు ప్రసంగించిన చిట్టచివరి సాహిత్య సభ ఇదే!

1948లో ప్రభాకరశాస్త్రిగారి షష్టిపూర్తి సన్మానము చేయడానికి తిరుపతిలో ఒక సంఘ మేర్పడింది. శాస్త్రిగారు తమ సహజ వినయంచేత దానికి విముఖతను వెల్లండించారు. తుదకు పట్టుపట్టగా తమ కత్యంతాప్త మిత్రులు ప్రముఖ న్యాయవాదులు శ్రీ పరమాత్మని రాధాపతి గారిచ్చిన ఖద్దరు లాల్చీని మాత్రము గైకొన్నారు. పటాటోపములయెడ వారికి మొదటినుండీ విముఖతే !

శాస్త్రి గా రున్నన్ని నాళ్ళు తిరుపతిలో వారి నేతృత్వంలోనే అన్నమాచార్యోత్సవాలు జరిగాయి. 1945 లో శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ కాలేజీ వజ్రోత్సవాల్లో ప్రభాకరశాస్త్రిగారు ప్రధాన ప్రసంగం చేశారు. ఆ నాటి సభకు వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు సభ్యులు శ్రీ ఆర్కాటు రామస్వామి మొదలియారు, మద్రాసు యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్ శ్రీ ఆర్కాటు లక్ష్మణస్వామి మొదలియార్ ప్రత్యేకాహూతులుగా వచ్చారు. శాస్త్రిగారా సభలో 'తెలుగు ఏనాటికైనా అధికార భాష' కాగలదని ఉద్ఘాటించారు. తిరుపతిలో యూనివర్సిటీ ఉండాలని కలలు గన్నవారిలో శాస్త్రి గారొకరు. ఆ రెండు కోరికలూ అనంతర కాలంలో ఫలించాయి. వారిది బ్రహ్మవాక్కు.

# 17. యోగవికాసం

మాష్టరు సి వి. వి. అను మూడక్షరాలే మూల మంత్రంగా ఏర్పడిన నవీనయోగం లేక భృక్తరహిత తారక రాజయోగాన్ని ప్రభాకర శాస్త్రిగారు అందు ప్రవేశించిన నాటినుండి (22-6-1966) తాము తుది శ్వాస విడివచేరకు (29-8-1950) అసిధారా వ్రతంగా యోగసాధన నెఱపిన తపోనిధులు. గండుచీమ పట్టుకొన్నట్లు యోగాన్ని పట్టుకొన్నారు. అది మహా విశ్వాసపూర్వక మైంది. ప్రార్థనకు వేళ తప్పిన దిన మొక్కటీ లేదు. వారి సర్వ జీవ నాడులందు ప్రవహించునది మాష్టరు సి వి.వి. చింతనమే! తాము నెఱపిన సర్వ నిర్వాహములూ తమ పరమ గురువుల దివ్యానుగ్రహమువల్లనే జరుగుతున్నవనే పరిపూర్ణ విశ్వాసమే ఆయనకు ఊపిరి దానిలోనే ఆయన జీవితం నమ్మిన దానిని లక్ష్య శుద్ధితో ఆచరించిన కర్మయోగి. ఆయన చేయనిది చెప్పలేదు. చెప్పినది తా నాచరింపక మానలేదు. చిరంతన సత్యగవేషణే ఆయన జీవిత సూత్రం. అంత రుద్భోధమే ప్రమాణంగా ఆయన యోగసాధనలో పురోగమించారు. అన్నింటిని జరుపుచున్నది మాష్టరు ప్రజ్ఞయే అనే విశ్వాసంతో ఉండేవారు క్రమ క్రమంగా ఆముష్మిక చింతనే ఆయనను ఆక్రమించింది.

"ప్రపంచ మంతా తల్లక్రిందులైనా సరే ప్రాక్టీసులో (సాధనలో) ఆక్షన్ (యోగి క్రియ) జరుగుతూ దానివల్ల ఇతరులకు ఉపకారం జరుగుతూ నాకు సచ్చిదానందాలు లభిస్తూ ఉండడం బట్టి నా ముక్కులో ఊపిరి ఆడుతూ ఉండే దాకా నేను ఈ మార్గాన్ని విడుచువాడను కాను ఈ విషయం మార్గశిర శుద్ధానికి నేను మద్రాసు వచ్చినపుడు రామానుజమున్నూ, యన్.ఆర్ బి వి. కుమారుడున్నూ వచ్చి ఉండగా స్పష్టం చేసినాను. ఒకవేళ యన్. ఆర్. బి. వి. శరీరం విడిచినా నేనీ నిశ్చయానికి కారణం నాలోని సి. వి. వి. ఆక్షన్ గానే ఉంచుకున్నాను గనుక చలింపను అని స్పష్టంగా చెప్పినాను. ఆ నిశ్చయమునందే నేను నిలిచి తీరుదును గాక! ఇట్టి ధైర్యము సి.వి.వి నాకు అనుగ్రహించినారు. వారి మీది ప్రేమ నౌక సహాయముననే ఆపత్సముద్రమును గడపగలను గాక" ఇవి మాటలు కావు. మంత్రాలు !!

యోగ సందర్భంగా ఆయన బాహిరమైన పుస్తకప్రమాణాల నెప్పుడూ ఉట్టంకించేవారు కాదు. 'నా అంతరుద్బోధ మిది. ఇట్లా చేయండి' అనేవారు. మాష్టరు సి.వి వి.గారి 'మీడియము'లలో మే మెఱిగినది శాస్త్రిగారినే. ఆయన యోగిపుంగవుడు. యోగసిద్ధి పడసిన మహాభాగుడు.

ఈ యోగము వ్యక్తిపరమైన మోక్షానికై ఉద్దేశింపబడలేదనీ, 'లోక కళ్యాణమే' యోగగమ్యమనీ చెప్పేవారు. ప్రజ్ఞ పనిచేయుచుండగానే యోగవికాసం గుర్తింప గల్గుట ఇందలి విశేషం. మనిషి అవశుడై, సమాధిస్థితి నందుట గాదు. కుండలినీ ప్రచోదనమూ, సహస్రార విజంభణమూ, నాడీమండల మంతట ఒక శక్తి అప్రయత్నంగా ప్రవహించుటా ఇందులో జరుగుతుంటాయి. పరమ గురు స్మరణ చేయటంతో ఒక అపూర్వశక్తి చాలనము జరగటం విశేషం. 'ఎటర్నిటీ' (మృత్యుంజయత్వము) ఈ యోగచరమ గమ్యం. త్రిశక్తులను అధిగమించి **'Fourth Dimension work'** కావలెనని పరమ గురువులు సంకల్పించి ఈ యోగాన్ని ఏర్పాటు చేశారు.

ప్రభాకరశాస్త్రిగారిలో ఈ యోగవికాసం అపూర్వరీతిని ఘటిల్లింది. కొన్ని అద్భుతశక్తులూ వారి నాశ్రయించినాయి అవి నిస్వార్థసేవకే వినియోగింప బడ్డవి. అందులో ఒకటి యోగచికిత్సద్వారా మానసిక, దైహిక రోగములను మాన్పుట. దీనినే వారు 'ట్రీటుమెంటు' అనేవారు. శ్రీ శాస్త్రిగారి కడకు ట్రీటు మెంటుకు వచ్చేవారిలో రిక్షా లాగేవారు, కస వూడ్చుకొనేవారు, ఆఫీసు గుమాస్తాలు, ఆఫీసర్లు, ఉపాధ్యాయులు, యూనివర్సిటీ ప్రొఫెసర్లు, డాక్టర్లు, ఇంజనీరులు, లాయరులు, సనాతనులు, విద్యార్థులు, కమ్యూనిష్టులు, కాంగ్రెసువారు, ఇట్లు పలు తెఱగుల వారుండేవారు. తేలుకాటు, ఒడలు కాల్పు, టైఫాయిడు, పరిణామ శూల, పైత్యకోశంలో రాళ్ళు, నంజు, జలోదరము, క్షయ మొన్నగు బాధలను యోగ 'ట్రీటుమెంటు'తో చక్కజేసేవారు. ఇది యిట్లా ఉండగా ఉత్తరాల ద్వారా దూర దూరాల నుండి తమ తమ ఆధివ్యాధులను వారికి తెలియజేసి, ట్రీటుమెంటు ద్వారా బాగయినవారు కొన్ని వందలమంది !

శ్రీ శాస్త్రిగారి యోగశిష్యులు శ్రీ కొత్త రామకోటయ్యగారు ఇట్లా ఒక చోట వ్రాసినారు : "మా గ్రామములో ఉన్న సాధకులలో ఎవరికైనను జబ్బు చేసి

నపుడు ఆ విషయమును శాస్త్రిగారికి తిరుపతి జాబు వ్రాసేవారము. ఆ వ్రాసిన జాబు పోస్టు డబ్బాలో వేసేవారం. ఆ జాబు శ్రీ శాస్త్రిగారికి చేరుటకు రెండు మూడు రోజులు పట్టుతుంది. కాని ఆ జాబు ఇక్కడ పోస్టు డబ్బాలో ఉండగానే ఆ రోగికి రోగబాధ తగ్గిపోవుట ఆరంభ మయ్యేది. ఆ సాయంకాలానికే ఆ రోగి రోగ విముక్తుడై హాయిగా తిరిగేవాడు. అనగా శాస్త్రిగారు మన జాబు చూడకముందే రోగనివారణ జరిగేదని అర్థం. ఇందుకు కారణం శాస్త్రిగారిలో ఉన్న అపారమగు ప్రేమయే అనిన్నీ, ఇతరులకు ఆనందం కలగాలన్న వారి ఆకాంక్షయే ముఖ్య కారణ మనిన్నీ తెలుసుకోగలం.''

కరుణా, సానుభూతీ, అనుతాపమూ శాస్త్రిగారిలోని ప్రధాన గుణాలు. అవి ఈ ట్రీటుమెంటుకు దోహదకారులైనాయి. వారిచే యోగ చికిత్స పొంది రోగ నిర్ముక్తులైనవారిలో కొందరు శ్రీ కొత్త వేంకటేశ్వరరావు (లాయరు, గుంటూరు), కొత్త రామకోటయ్యగారు (చిన కాకాని), జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి (బందరు), అడవి బాపిరాజు (భీమవరం, లాయరు), తిరుపతి ప్రిన్సిపాలు శ్రీ పి. వి. రామానుజస్వామిగారి శ్రీమతి, చిత్తూరు నాగయ్య (మదరాసు), టి. పి. భాష్యకారాచార్యులు (రాయవెల్లూరు). వి. మునికృష్ణయ్యగారు (తిరుపతి), కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు (మదరాసు), విస్సా సుబ్రహ్మణ్యంగారు (బెంగుళూరు), డా॥ గాలి బాల సుందరరావుగారు, వారి శ్రీమతి (మద్రాసు), ఉనికిలి వేంకట్రాజు (గుండుగొలను), యన్. పద్మనాభ స్వామిగారు (రాజమండ్రి) ఇట్లా ఎంత మంది నని పేర్కొనేది? మచ్చుకొకటి రెండు సంఘటనలు.

నేను తిరుపతిలో శాస్త్రిగారికడ విద్వాన్ ఐదవ సంవత్సరం చదువుతున్నాను (1945-46). అక్టోబరు నెల్లో ఒక నెలపాటు తీవ్ర జ్వరం వచ్చింది. ఎప్పటికీ తగ్గదు. శారీరక, మానసిక స్వాస్థ్యములు సడలినాయి. నా పిచ్చి నాకానంద మన్నట్లుండేది. అప్పటికే నాకు పెండ్లయింది. శరీరముపై, మనస్సుపై పట్టు తప్పింది. శ్రీ ప్రభాకరశాస్త్రిగారి చరణము లాశ్రయించాను. ప్రార్థనకనుదినమూ రావలసిందిగా ఆదేశించారు. జ్వరం వస్తూనే ఉంది. బరువు తగ్గిపోతూంది. అయినా వారింటికి ప్రార్థనకు వెడుతూనే ఉన్నాను. ఒకరోజు శాస్త్రిగారు నన్నూ, నాస్థితినీ పరికించి 'నీకేం కావాలి?' అన్నారు. అప్పటికి నాశరీరం సల సల కాగుతోంది ఎప్పటిలాగే. నేనో వింత కోరిక కోరాను. 'నా దేహం

హిమానీ గృహంలో ఉంచాలి. అది సౌధోపరి భాగమై ఉండాలి అదీ ఒక భవనమే! ఏకాంతంగా ఉండాలి. దాని చుట్టూ 'లాను'లో పుష్పోద్యానం ఉండాలి నిస్తరంగ నీరధిలా నిశ్శబ్దం అక్కడ రాజ్యం చేయాలి. నన్నెవరూ అక్కడ నిద్ర లేప రాదు. ఇట్లా కోరికల పరంపర సాగింది శాస్త్రిగారిది అంతా విని 'మన కరణం కవి అవుతున్నాడే!' అని పరిహాసం చేశారు వారు నా కోరిక లంగీకరించిందీ లేనిదీ అప్పుడు నాకు తెలీదు. ఇంతలో ప్రార్థన సమయ మైంది. శాస్త్రిగారు ప్రార్థనలో కన్నులు మూసి కొన్నారు. అంతా ప్రార్థన కుపక్రమించారు. అందరి కన్నులూ మూత పడ్డాయి అప్రయత్నంగా. మహాద్భుతం! నే కోరుకున్న వాతావరణం, నాకు ప్రసాదింపబడింది. నా శరీరం మంచు టింటిలోనే ఉంది. అదీ రెండు మూడు గంటలపాటు అనుభూతి! నా ఆనందానికి అవధుల్లేవు. ఎంతో హాయి! శరీరం లోని ఉష్ణ తీవ్రత పూర్తిగా మటుమాయ మైంది. నేను ఆ సుఖ నిద్రనుండి లేచిన తర్వాత, శాస్త్రిగారందరినీ అడిగినట్లే నన్నూ అడిగారు" జరిగిన దివ్యానుభూతిని సవినయంగా వివరించాను. ఆ అనుభూతినే, నాలుగైదేళ్ళ తర్వాత అక్షర బద్ధం చేశాను 'ఆనందవల్లి' కావ్యంలో,

ఉ. ఆకయినన్ జలింపదు లతావనిలో, నవ యామినిన్ రసో
త్సేకమునన్ కదల్పదు ఖుషీగను కోయిల బాల కంఠమున్
నీ కనుసన్న నే మెలగి నీడజముల్ రవమున్ ఘటింప వే
నాకలి గొన్న వాడ నయి యచ్చట నిద్ర కుపక్రమించితిన్!

ఉ. నిద్దుర యంచు బక్కను ఘనీభవమౌ ఇహ సౌఖ్య రాశియే
ముద్దయినట్లు తోచె, నవ మోహన మంగళ శాంతి నిక్వణ
మ్మద్దరి విన్పడెన్, ఒక మహా లలితమ్మును పుష్పశయ్యలో
నిద్దురవోవ నాజ్ఞయిడె, నే శయనించితి నందు పొందుగన్!

నిద్ర లేచిన తర్వాత శాస్త్రిగారు మళ్ళా 'నీకేం కావా'లన్నారు. రోజుకు పద్దెనిమిది గంటలు చొప్పున 21 రోజులు నిద్ర కావాలన్నాను. 'ఏమిటీ వింత కోరిక?' అన్నారు మళ్ళీ. కాని వారంగీకరించినట్లూ, అనుగ్రహించినట్లూ నేను భావింపనే లేదు. కాని మహా విచిత్రం! అంతే! ఆ మరునాటినుండి ఇరవై యొక్క దినాలు రోజుకు పద్దెనిమిది గంటల చొప్పున నిద్రపోయాను. నా శరీరానికి ఎంత

విశ్రాంతి! ఎంత బలము! ఎంత ఉత్సాహము! ప్రసాదించిందో ఆ నిద్ర చెప్ప లేను. ఆ నాటితో రోజుల తరబడి నన్ను పట్టి పీడించిన వ్యాధులన్నీ మటుమాయ మైనాయి. ఒకటి, రెండు రోజుల్లో పూర్ణారోగ్యవంతుణ్ణయినాను. అనుగ్రహించి నట్లు కన్పడకుండా అనుగ్రహించటం ప్రభాకరశాస్త్రి యోగిపుంగవులలో ఒక విచిత్రం!!

## సంపంగి పరిమళం :

ఒక తూరి తిరుపతిలో సంస్కృత విద్వాంసులు శ్రీ అప్పల సోమేశ్వర శర్మగారూ, హిందీ ప్రధానాచార్యులు అయాచితుల హనుమచ్ఛాస్త్రిగారూ మరి కొందరూ పండిత మిత్రులు శ్రీ శాస్త్రిగారింట గోష్ఠి జరుపుతున్నారు. ప్రాస్తావికంగా శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తమ పరమ గురువులు మాష్టరు సి.వి.వి. గారి మహనీ యత గురించి యోగ వికాసాన్ని గూర్చి ఉత్సాహంతో ముచ్చటిస్తూ వారి దివ్య శక్తులను శ్లాఘిస్తున్నారు. ఆ మహత్తర ప్రసంగాన్ని విన్న పండితులు శాస్త్రి గారిని మీరు సాధన చేస్తూన్న యోగం మహనీయమైందే! అయినా మాకు ఆ దివ్య యోగ మహత్త్వం ఎఱుకపరచటానికి ఒక నిదర్శనం చూపవలసిం"దని అభ్యర్థిం చారు. ఇది 1948-49 నాటి మాట. శాస్త్రిగారది విని వారిని అట్లయిన 'మీకే పువ్వు పరిమళం ఇష్టమో చెప్పం'డన్నారు. 'సంపంగి' మా కిష్టమని చెప్పారు. అవి నిజా నికి తిరుపతి ప్రాంతంలోనే లభింపవు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వెంటనే క్షణకాలం నిమీలిత నేత్రులయి తమ గురువులను లోన స్మరించుకొన్నారు. అంతే! తోడనే ఆ పండితులంతా కూర్చున్న గది అంతటినీ సంపంగి పరిమళం ముంచేసింది. ఆ దివ్య సుగంధ మెక్కడినుంచి వచ్చింది? ఆ పువ్వు పూచే ఋతువు కూడా కాదే! ఇట్లాంటిదే మరో సంఘటనను పౌరాణికులు శ్రీ కల్లూరి వీరభద్ర శాస్త్రిగారు చెప్పగా విన్నాను. ఇన్ని దివ్యశక్తులున్నా శాస్త్రిగారు వాటిని తఱచు ప్రదర్శిం చటం గాని, ప్రచారం చేయటం గాని చేయలేదు. వారి హృదయ గుహలోనే గూఢంగా ఇమిడి ఉండేవి. శ్రీ శాస్త్రిగారు సంకల్పించిన వెన్నో జరిగిన సంఘట నలు వారి శిష్యులూ, భక్తులూ ఇప్పటికీ చెప్పుకొంటారు. ఆగతానాగతాలను చెప్పుట కూడా ఉండేది. ఇట్లాంటివి కోకొల్లలు! కొన్ని ప్రవచనాలు:

1. స్వానుభూతిని మించిన దివ్యౌషధం ఇంకేదీ లేదు. మనలో వెల్లివిరిసే ప్రేమ అన్నింటినీ చక్క దిద్ద గల దివ్యౌషధం

2. మనం దేనినైనా నమ్ముకుంటే దానిలోని సత్యాన్ని గుర్తించే వరకు గండుచీమ పట్టుకొన్నట్టు దానినే ఆరాధించాలి. సాధన చేయాలి.

3. ఎందరకు ట్రీటుమెంటు (యోగ చికిత్స) చేసినా యేమీ దీకాకుండదు. ఎంత యిచ్చినా తరగని తనమే ఈశ్వరత. అదే మనలో నెలకొనాలి.

4. బహిర్ముఖంగా సాగుతున్న బహుత్వమును సాగ నిచ్చుచునే అంతర్ముఖంగా తిరిగి అం దేకత్వము గుర్తించి వర్తించుట ఈ యోగ సాధనమున కొక ఫలితము.

5. మృత్యువును ధిక్కరించే శక్తిసామర్థ్యాలు కలగాలనీ, అమరత్వ సిద్ధి కలగాలనీ, ఆ అమరత్వ సిద్ధి ఇచ్చటనే ఈ శరీరంలోనే పొందాలనీ కోరుకొందాం:

శ్రీ ప్రభాకర శాస్త్రిగారికి నా అక్షరార్చన :

ఉ ధ్యానమె యోగమై - పరమతత్త్వము నించెడు బ్రహ్మతేజమై
మౌనమె మేలి వ్యాఖ్యయయి - మంజుల వాక్కొక కాంతి గోళమై
ప్రాణము నార్తసేవకయి పంచిన సత్యదయా పయోనిధిన్
ప్రాణము ప్రాణమైన గురుపాదుల నే శరణంబు చొచ్చితిన్!

# 18. అమృతమయుడు

ఎడతెరిపి లేని భాషా పరిశ్రమా,గడిదేరిన యుభయ భాషా సారస్వత పాండిత్యములూ - వడి గల కార్యదక్షతా, ఒడిదొడుకులు లేని తేట తెనుగు కవితా రచనా-కడదాకిన తాత్త్వికదృష్టీ రాశీభూతమైన మహారచయిత వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. సవిమర్శకంగా పూర్వకవి కృతులను ప్రకటించి వాసికెక్కిన ఆంధ్ర భాషోపకారి. దైవికమైన ఉపజ్ఞతో కలం పట్టి కటిక సత్యాలు వ్రాసిన నిష్ఠాగరిష్ఠులు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారన్నట్లు 'ఉదారచరితులకు మనలో ప్రభాకర శాస్త్రిగారు మంచి వరవడి'. భాషా, సాహిత్య - చరిత్ర - పురాతత్త్వ, శాసన, ఖగోళ, యోగశాస్త్రాలలో లోచూపుతో పరిశోధించిన మనీషి. కవిగా, పరిశోధకుడుగా, పరిష్కర్తగా, విమర్శకుడుగా, లిపి సంస్కర్తగా, ప్రాచీన గ్రంథ సముద్ధారకుడుగా, శబ్దవేత్తగా ప్రభాకరశాస్త్రిగారు మేరువంత ఎత్తు ఎదిగినవారు. శతాబ్దాల తరబడిగా నిర్లక్ష్యం చేయబడ్డ మన సాహిత్యం గురించి పరిజ్ఞానం కలిగించుట కాయన సాగించిన అమోఘకృషికి అన్నమాచార్య పదాలు తార్కాణం మాత్రమే. ఆంధ్ర సాహిత్య సంస్కృతి వికాసాలకు శాస్త్రిగా రొనర్చిన సేవలు మరువరానివి. భాషాపరిణామాన్ని గుర్తించిన ప్రాజ్ఞుడు. ఈనాటి ద్విపద, శైవ, యక్షగాన, దేశికవితా పరిశోధనలకు దారులువైచిన ప్రాగ్రేసరుడు. మౌలిక ప్రతిభతో వెలిగిన సారస్వత జ్యోతి. ఇది లోక మెఱిగిన ఒక అంశ.

వ్యక్తిగా ఆయన మానవతా మూర్తి. కరుణ, సానుభూతి ఆయన జీవనాడులు. ఆర్తసేవ ఆయన ఊపిరి. నిరాశా నిస్పృహలతో సతమత మవుతున్న ఆర్తుల కెందరికో ఆరోగ్యాన్ని యోగమహిమ ద్వారా ప్రసాదించిన మహనీయుడు. ఎవరైనా ఆయనను చూస్తే అప్రయత్నంగా నమస్కరింప బుద్ధి పుట్టేది. నార్ల వేంకటేశ్వరరావుగా రన్నట్లు "ఆయన నిజంగా అమృతహృదయుడు." కొందరు మహామహుల సమక్షంలోకి వెళ్ళినప్పుడు మన సంకుచిత భావాలకు మనము లోలోపల సిగ్గుపడతాము. అట్టి మహామహుల కోవకు చెందినవారు శ్రీశాస్త్రిగారు. శాస్త్రిగారి మనస్తత్త్వాన్ని బాగా దగ్గర ఉండి ఆకళించుకొన్న విద్వాన్ విశ్వం

గారి మాటలు ముత్యాల మూటలు : "ఆయన ఆధ్యాత్మిక జీవితం నాకు తెలుసు. కులపతి లాంటి ఆయన పాండిత్య ప్రకర్ష నే నెఱుగుదును. భరతునిలాంటి ఆయన రసప్రలుబ్ధత నాకు తెలిసినదే ...ఆయన పరిశోధన లోతులు నాకు పరిచితమైనవే ఈ అన్నిటికన్న ఆయనలోని ఆర్ద్రహృదయత నన్ను వినమ్రుని చేసివైచినది."

శిష్యులను పుత్ర నిర్విశేషంగా ప్రేమించిన దేశికోత్తముడు. నలుబదేండ్లు దృఢ దీక్షతో యోగసాధన చేసి దానివల్ల లభించిన ఆత్మశక్తులను నిరపేక్షంగా వినియోగించి ఎందరి రోగాలనో కుదిర్చిన మానవతా మూర్తి. తుది శ్వాస విడు చుటకు ముందు కూడా ఒక వృద్ధురాలి బాధను పోగొట్టుటకై 'ట్రీటుమెంటు' చేసిన కర్మయోగి. ఎక్కడ కష్టం కలిగినా విలవిలలాడిపోయే ప్రవృత్తి. ఇన్ని శక్తులు వారిలో ఉన్నా, అది వారి పరమ గురువులు మాష్టరు సి. వి వి. గారి నిర్వా హకమని త్రికరణశుద్ధిగా చెప్పిన మనస్వి. సత్యాన్వేషణకై ఆహరహం శ్రమిం చారు. 'రేపు' లోనే జాతి భవిష్యత్తు ఉందని విశ్వసించిన ఆశాజీవి. ఆంధ్ర భాషా సాహిత్య పురోభివృద్ధికి జీవితమొడ్డిన పుణ్యశ్లోకుడు దేశసమస్యలకై పరితపించి, మథనపడి వాటి పరిష్కారానికై యోగశక్తుల నొడ్డిన దేశభక్తుడు. కఠోరదీక్షతో యోగజీవితం నెరపిన దక్షుడు. బుద్ధునిలా కరుణామయుడు. శరీరమనే పుస్తకాన్ని శోధించి ఈశ్వరతత్త్వము నరసిన యోగివరేణ్యుడు. విశ్వశ్రేయస్సునే కాంక్షించి, దానికై తపించి ఆచరణలో చూపిన పుణ్యజీవి. విద్యార్థిగా ఆయనను వీడి వచ్చే టప్పుడు నాలో మెఱసిన మెరుపు తునుక :

చం ఒక మధురక్షణమ్ము గురు
తున్నది జీవన సంధ్యలో సము
త్సుకత గురూత్తముండు సుమ
సుందర హస్తమునన్ స్పృశించి, అం
గకముల దివ్యదీప్తుల
ప్రకంపితు జేసిన వేళ, కాంతి వ
ల్లిక యెద నాటె తన్మధుర
లీల మనమ్మును బాయకుండగన్ !

అనుబంధం - 1

# శాస్త్రిగారి సారస్వత వరివస్య- పరిశోధనలు

1. పావులూరి మల్లన నన్నయ సమకాలికుఁడగు మల్లనకు మనుమఁడని నిరూపణ.
2. తెనాలి రామలింగ, రామకృష్ణ లొక్కఁరే యనుట.
3. కందుకూరి రుద్రకవి రాయల భువన విజయ సభలో ఈశాన్య దిక్కుఁన కధిపతి యని నిరూపణ.
4. నన్నెచోడుడు 12 వ శతాబ్ది వాడనిరి. ఈ నిర్ణయమే ఈ వాదమున చివరి మాట.
5. క్రీడాభిరామము శ్రీనాథ కర్తృకమే.
6. రెడ్డి రాజ్య చరిత్రకు పునాది వంటిది 'శృంగార శ్రీనాథ' కృతి.
7. తొలి తెలుగు కవయిత్రి తాళ్ళపాక తిమ్మక్కఁ అని నిర్ధారించుట.
8. 'శివ కవు' లున్నా రని, వారి కవితా రీతు లిట్టి వని తొలిసారి విశదీకరించుట
9. దేశి కవితా సముద్ధరణ.
10. తొలి తెలుగు పదము 'నాగబు' అని శాసనము నందు గుర్తించుట.
11. అహదనకర శాసనమందు 'వింత యక్కఁరము' ఉన్నదని చూపుట.
12. శిథిల ద్విత్వ నిరూపణ.
13. తంజావూరు దేవాలయములలో దేవతా విగ్రహములతో పాటు, రాజుల విగ్రహము లున్నవని తొలుత గుర్తించుట.
14. 'వృక్షాయుర్వేదము' ఉనికి శోధించుట.
15. రాయల మూడవ భార్య 'కమల' అని సప్రమాణముగ తెల్పుట.
16. తెలుగు వ్యాకర్త లెవ్వరును ప్రస్తావింపవి మ, వ ల వినిమయము.

17. చరిత్ర పూర్వ యుగ సమాధులు త్రవ్వించుట.
18. కాటమరాజు కథ గూర్చి మొదటి కిరణము ప్రసరింపజేయుట.
19. సి. పి. బ్రౌనుదొర కృషి ప్రశస్తిని 1911 లోనే తెల్పుట.
20. ఆధార గ్రంథముల ప్రచురణ.
21. తాళ్ళపాక అన్నమయ్య గూర్చిన పరిశోధన.
22. తంజావూరు ఆంధ్ర కవుల గూర్చి తొలుత వివరించుట.
23. ఆంధ్ర లిపి సంస్కరణకు సూచనలు (1928).
24. అపూర్వ రీతిలో 'చాటుపద్య సంకలన' ప్రచురణ.
25. ప్రాచీనాంధ్ర కృతులు 23 పరిష్కరించుట, ప్రచురించుట.
26. ఇనుప గుగ్గిళ్ళ వంటి నాచన సోమన పద్యములకు వ్యాఖ్యాన రచన.
27. మరి పదకొండు ప్రాచీన కృతుల పరిష్కారము.
28. శాసన పరిష్కారము.
29. ఇక్ష్వాకుల పుట్టు పూర్వోత్తరాలు తెల్పుట.
30. కల్నల్ మెకంజీ స్థానిక చరిత్రల ప్రకటన.
31. భాషా శాస్త్ర విశ్లేషణ.

అనుబంధము - 2

# వేటూరి ప్రభాకర శాస్త్రి గారి రచనలు

## 1. పరిష్కరణలు

1. అప్పన 'చారుచర్య' (1922).
2. ఉద్భటారాధ్య చరిత్ర (1925).
3. మనుచరిత్ర (1926).
4. బసవ పురాణము (1927).
5. బసవోదాహరణము (1928).
6. నీతిద్విషష్టికా (సంస్కృతము) (1928).
7. క్రీడాభిరామము (1928).
8. బాలభావ (1930).
9. ఉత్తర హరివంశము (1937).
10. సుగ్రీవ విజయము (యక్షగానము) (1939).
11. హరవిలాసము (1939).
12. గ్రంథవివరణికలు (Descriptive Catalogues) 19 సంపుటాలు.
13. రంగనాథ రామాయణము (1942).
14. వేంకటేశ్వర వచనములు (1945).
15. అన్నమాచార్య సంకీర్తనలు IV & V సంపుటాలు (1947).
16. అన్నమాచార్య చరిత్ర (1949).
17. ధనుర్విద్యా విలాసము (1949).
18. శృంగారామరుకము (1949).
19. ఆంధ్ర కామందకము (1950).
20. కాటమరాజు కథ (1950).
21. సుభద్రా కళ్యాణము (1950).
22. పావులూరి మల్లన సారసంగ్రహ గణితము-పరిష్కరణ(1950) ప్రచురణ (1952).

## పరిష్కృతములు - అముద్రితములు :

23. కాశీఖండము.
24. శివతత్త్వసారము
25. కవిలోక చింతామణి.
26. నైషధ పారిజాతీయము.
27. నన్నెచోడ కుమార సంభవము - 8 ఆశ్వాసములు మాత్రము.
28. బేతాళ పంచవింశతి.
29. శారీరము - ఎలకూచి బాల సరస్వతి రచనము.
30. భీమ ఖండము.
31. నీలగిరి యాత్రా చరిత్ర.
32. కేయూర బాహు చరిత్రము.

## 2. సంకలనములు :

1. చాటు పద్య మణిమంజరి - (1913).
2. ప్రబంధ రత్నావళి (1918).
3. చాటుపద్య మణిమంజరి ద్వి.భా (1922).
4. ,, తృ.భా. (అముద్రితము).
5. లక్షణోద్ధారము (1948-50) ,,
6. శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు (1949).
7. శాసన సంకలనము (క్రీ.శ. 4 నుండి 12 వ శతాబ్దివరకు).
8. గాంధి రామాయణము (అముద్రితము).

## 3. వ్యాఖ్యానములు

1. మనుచరిత్ర (1926).
2. ఉత్తర హరివంశము - 4 ఆశ్వాసములు (1946-49).
3. నన్నెచోడ కుమారసంభవము - 1 వ ఆశ్వాసములో కొంత (1949).
4. నైషధ పారిజాతీయము (సంకల్పించినది).

## 4. కథలు

1. కామధేనువు కథ (1914).
2. కరుణకము (1924).
3. కలికి-చిలుక (1924).
4. తంత్రానందస్వామి (1930).
5. పుణ్యవతి - భాగ్యవతి (1930).
6. కాకి పగ (అలభ్యము).

## 5. చరిత్రలు

1. తంజాపూరి యాంధ్ర రాజుల చరిత్ర (1914).
2. శృంగార శ్రీనాథము (1923).
3. అన్నమాచార్య జీవిత చరిత్రము (1949).
4. ఆంధ్ర దేశీయ సంస్కృత కవుల చరిత్ర - కొంతవఱకు (1923-24).

## 6. రూపకానువాదములు

1. ప్రతిమ (1910) ముద్రణ (1927).
2. కర్ణ భారము (1913).
3. మధ్యమ వ్యాయోగము (1913).
4. భగవదజ్జుకము (1914).
5. మత్త విలాసము (1935).
6. నాగానందము (రెండంకములు మాత్రము).
7. సావిత్రి (సంకల్పము).
8. గౌరీ కళ్యాణము (శ్రవ్యనాటిక - స్వతంత్ర రచన (1944).

## 7. వచన కృతులు

1. నీతినిధి (ఆంగ్లమునుండి పరివర్తన) (1926).
2. తెలుగు మెఱుగులు (1948).
3. ప్రజ్ఞా ప్రభాకరము (ప్రచురణ 1951).
4. మీగడ తఱకలు (ప్రచురణ 1951).
5. సింహావలోకనము (ప్రచురణ 1952).

అనుబంధం - 3

# కవితా రచనలు

1. ఎడ్వర్డు పట్టాభిషేక శ్లోకములు (అలభ్యము).
2. ఒథెల్లో నాటకంలో పద్యాలు (1907, అలభ్యము).
3. పార్థసారథి (1906-10).
4. శ్రీ వేంకటేశ్వరస్వామి (1910).
5. నూతన వర్షము (1911).
6. పంచమ జార్జి పట్టాభిషేకము (1911).
7. శ్రీనివాస నిర్యాణము (1911).
8. తంజావూరి యాంధ్రరాజుల పీఠికలో (1914).
9. చల్లపల్లి జమీందారు అంకినీడు స్మృతి.
10. తిరుపతిశాస్త్రి స్మృతి (1921).
11. మూన్నాళ్ళ ముచ్చట (ఖండ కావ్యము (1922).
12. రాజరాజ నరేంద్ర ప్రశంస (1922).
13. పణీ పంచకము (అనువాదము 1923).
14. సమస్యా పూరణలు (1923).
15. అలవాటు (పద్యకథ) (1923).
16. ప్రతాపరుద్ర కళ్యాణములోని మూడు శ్లోకముల కనువాదము (1923).
17. దివ్య దర్శనము (ఖండ కావ్యము) (1924).
18. కృతార్థుఁడు (1924).
19. కలికి చిలుక కథల పద్యాలు (1924).
20. చిత్రనళీయంపై (1924).
21. బాల భారతీ నాటక సమాజ ప్రశంస (1924).

22. మహాత్ముని ఉపవాసదీక్ష (1924).
23. కాళహస్తి - శివరాత్రి (1925).
24. సప్తపదులు (1925).
25. స్వాగతము (1925).
26. ఆశంసనము (1924).
27. గాథాసప్తశతి - 18 గాథల తెనిగింపు (1925).
28. కడుపు తీపు (ఖండ కావ్యము) (1925).
29. కపోత కథ (ఖండకావ్యము) (1925).
30. విశ్వాసము (ఖండకావ్యము) (1926).
31. దక్షిణాంధ్ర బాలుడా! (1927).
32. శరణార్థి (గేయము) (1927).
33. చిన్ననాటి చేష్టలు (1928 - ఖండకృతి).
34. జిజ్ఞాసువు (అముద్రితము).
35. గోవర్ధన సప్తశతి - కొన్నింటి కనువాదాలు (1928).
36. చల్లపల్లిరాజా శ్రీ శివరామప్రసాద్ పట్టాభిషేక ప్రశంస (1929)
37. శరణార్థి (1929).
38. పూల విందు (అముద్రితము).
39. అర్ధాంగలక్ష్మి (1930).
40. తెలుగు తెలవ (1930).
41. శరణార్థి (1930).
42. ప్రాణేశ్వరుడు (అముద్రితము).
43. సతీర్థ్య సంప్రార్థనము.
44. సనత్ సుజాతీయము (అనువాదము-అముద్రితము).
45. పండితరాయ చాటువులు - రెండింటి కనువాదము (1940).
46. సీతాఫలము (గేయకథ) (1940).
47. నా గతి (1941).

48. భజగోవింద శ్లోకాలు - (అముద్రితము).
49. సత్రశాల (ఖండకావ్యము - అముద్రితము).
50. మాతృ శ్రీ (1944).
51. అమరావతీ శిల్పము (1943).
52. స్వాతంత్ర్య గీతం (15-4-47).
53. చెళ్ళపిళ్ళ ఆస్థానకవి పట్ట ప్రదానోత్సవము (1949).
54. పెండ్లి ముచ్చట (అముద్రితము).
55. నానా విధ చాటువులు.

ఇవి గాక గ్రంథ రూపమునకు రాని వ్యాసములు 108 వరకు నున్నవి.

